***ఈ*** ప్రపంచం ఎంతో మంది అమాయకులను శిక్షించిన దాఖలాలున్నాయి– అది న్యాయవ్యవస్థలోని బలహీనత. కాని నేరస్తులు ఎంతటి వారైనా శిక్షించకుండా వదిలిపెట్టలేదు– అదీ ఆ వ్యవస్థ గొప్పదనమే...

సామాన్యునికి, ఒక సాహిత్యకారునికి ఒకే వ్యవస్థలోని చట్టాలు విధించే శిక్షలో వ్యత్యాసం వుండకపోవచ్చు. ప్రపంచంలో ఏ వ్యవస్థలోనైనా చట్టం ముందు ఎవరైనా చేతులుకట్టుకుని నిలబడాల్సిందే! కాని ఒక మేధావి రచయిత లోనయ్యే సంఘర్షణలోనుంచి ఎంతటి సాహిత్యమైనా వెలువడుతుంది. ఆ దుఃఖసంద్రపు అగాధంలోని చీకట్లు చీల్చుకొని వెలువడే వెలుగు రేఖలు కేవలం రచయితే చూడగలడు. అవమాన భారాన్ని మోస్తూనే తన అంతరంగాన్ని పునీతం చేసుకొనే ప్రయత్నమే తన రచనా వ్యాసంగం.

దుఃఖపు లోయ లోతుల్లో ఎంత చీకటి వుంటుందో, ఆ గాఢాంధకారంలో అక్కడక్కడా వెలిగే మిణుగురుల కాంతిని చూడగలిగిన ఆస్కార్ వైల్డ్ "డి ప్రోఫండిస్" రచనలో ఎంతటి భావసాంద్రత వున్నదో తెలుస్తుంది, చదవండి.



**ఆ**స్కార్ వైల్డ్ ఏప్రిల్ ఒకటవ తేదీన, 1897లో, రీడింగ్ కారాగారం నుంచి రాబర్ట్ రాస్‌కు రాసిన ఉత్తరం:

**ప్రియమైన రాబీ,**

ఈ లేఖతో పాటు నీకు ఒక రాతప్రతిని పంపుతున్నాను. అది జాగ్రత్తగా చేరుతుందని ఆశిస్తూ.

ఆ రచనని శ్రద్ధగా నకలు చేయించు. ఇలా అడగటానికి చాలా కారణాలే ఉన్నాయి. మనకున్న దానితోనే సరిపుచ్చుకోవాలికదా.

ఒకవేళ నేను మరణిస్తే నా సాహిత్య సంపదకు నీవే అధికారివి కావాలని ఆశిస్తున్నాను. అన్నీ నీ అధీనంలోనే వుండాలని కోరుతున్నాను. నాకు న్యాయపరమైన అధికారం రాగానే వీలునామా రాస్తాను. నా భార్యకు నా రాతలు అర్థంకావు. అంతేకాదు, ఆమె అంత ఆసక్తి కూడా చూపదు. సిరిల్ చిన్నవాడు. అందువల్ల నీకే ఈ బాధ్యత అప్పగించాలి, మిగతా ఎన్నో విషయాలమాదిరిగానే!

నా రచనలు– పుస్తకాలు, వీటి అమ్మకాల ద్వారా వచ్చే సొమ్మును వివియన్, సిరిల్ ఖాతాలకే జమ చేయించు. నా సాహిత్యం, ఇతర రచనలు నీ అధీనంలో వున్నపుడు, ఈ రచనా నీ చెంతనే వుండవలసిన అవసరం ఉంది. ఎందుకంటే, నా అసాధారణ ప్రవర్తనకు వివరణ దీనిలోనే ఉంది. నీవు ఈ ఉత్తరం చదివినపుడు నామానసిక సంఘర్షణ – ఇతరులు అపార్థం చేసుకున్న నా వ్యక్తిగత జీవితం– వికృతమైన ఆధిపత్యంతో

పాటు అంతులేని మూర్ఖత్వం– ఇవన్నీ, వీటన్నిటికీ కారణాలు, వివరణలు తెలుసుకోవలసిన అవసరంవుంది. అలాగే వీటిని ప్రపంచానికి తెలియ జేయవలసిన బాధ్యతా వుంది. కాని ఆ పని నేను జీవించి వుండగా చేయకు. ఎందుకంటే ఈ సమాజం నన్ను ఇరికించిన బాధాకరమైన చట్రంలోనే నేను కూర్చుండి పోను; నాకు వారసత్వంగా వచ్చిన కీర్తి ప్రతిష్టలను శాశ్వతంగా మలిన పరుస్తూ ఇక్కడే వుండిపోను. ఆ మాలిన్యాన్ని వదిలించు కోవలసిన అవసరం వుంది. నన్ను నేను సమర్థించు కోవటం నా వుద్దేశ్యం కాదు. కాని దీనికి పూర్తి వివరణ ఇవ్వవలసిన బాధ్యత నాదే. అంతేకాదు, ఈ జైలుగదిలో నా మానసికస్థితి లోనయిన ఎన్నో అనుభూతులను తెలియజెప్పాలి. నా మేధోపరమైన పరిణామాన్ని, జీవితం పట్ల నా దృక్పథాన్ని పూర్తిగా వివరించాలి. నేను బైటకు వచ్చినపుడు, ఏ విధంగా ఈ ప్రపంచాన్ని ఎదుర్కోవాలి! అంతేకాదు...

ఒక విధంగా ఇది నాకు తెలిసిందే– అదే నేను విడులయ్యే రోజున నా ప్రయాణం ఒక కారాగారం నుంచి మరో దానిలోకే–

అవును – ఈ ప్రపంచం అంతా ఇపుడు నేనున్న ఈ జైలు గది కంటే పెద్దది కాదని అనిపిస్తోంది. అదీకూడా నన్ను భయభ్రాంతుణ్ణి చేసేదే అని!

అయినా నా నమ్మకం– మొదట్లో దేవుడు ప్రతివానికి– ఎవరి ప్రపంచం వాడికి సృష్టించాడని– మనలోనే వున్న ఆ లోకంలో ఎలా బ్రతకాలో ప్రయత్నించాలి.

నేను ఈ ఉత్తరంలో రాయబోయే ఆ విషయాలన్ని నిన్నంతగా నొప్పించక పోవచ్చు – ఇతరుల్లాగా – నీకు నేను ప్రత్యేకంగా చెప్పనవసరం లేదుగా–



నిరంతరం ప్రవహించే ఆలోచనలతో పాటు – మన ఉద్వేగాలన్నీ ఎంత అస్థిరమైనవిగా మారిపోతుంటాయో– కాని అవి సృజన ప్రక్రియ ద్వారా ఒక గమ్యం వైపు పయనించగలవని అనిపిస్తుంది...

వేదన అనేది వర్తమాన కాలంగానే అనుకుంటాను– దాన్ని ఋతువులుగా విడదీయలేం. మనం చెయ్య గలిగిందల్లా ఆవేదన సాంద్రతను గుర్తుంచుకో గలగటమే– బాధ పునరావృత తీవ్రతను అక్షరబద్ధం చేయటమే! మనతో కాలం ముందుకువెళ్లదు. అది ఆవృత్తమే. అది ఒక దుఃఖకేంద్రం చుట్టు పరిభ్రమిస్తుంది!

ఈ జీవితం స్తంభించినపుడు అందులోని సంఘటనలన్ని ఒక పద్ధతిలో మార్పులేకుండ ఉండిపోతాయి. అలాగే మన దినచర్యలో కూడా. ఎటొచ్చీ మోకాళ్ళపైవాలి మొక్కు తుంటాము.

ఇదంతా ఒక ఇనపచట్రంలో బిగిసిపోయిన చట్టం! కదలని గుణం ప్రతిక్షణాన్ని నరకప్రాయం చేస్తుంటుంది. బాహిర శక్తులకు దీని అంతస్సారం ఒక అనంతమైన మార్పేనని చాలా వివరంగా తెలియవస్తుంది.

ఎటొచ్చీ శీతగాలులు-శిశిరవనాలు- వెచ్చని ఎండపొడలూ జైలులో మనకు తెలియవు కదా-

మనకు ఒకటే ఋతువు! అది దుఃఖ ఋతువు! మన జీవితంలో నుంచి సూర్య చంద్రులు నిష్క్రమించి నట్లే- బయట వెలుతురు బంగారు కాంతులీను తుంటే, ఈ జైలుగది కటకటాల కిటికీ అద్దపు మరకల్లోంచి తొంగి చేసేది నైరాశ్యపు నీడలే !

ఈ బందిఖానాలో ఎప్పుడూ సంధి చీకటే- గుండెల్లో ముసురే! ఆలోచనలన్నీ స్తంభించినట్లు ఇక్కడ కాలం కూడా కదలదు కదా. నువ్వు ఏనాడో మరిచి పోయిన విషయం- ఇప్పుడు నన్ను కలవరపెడుతూనే వుంది. ఇది గుర్తు పెట్టుకుంటే చాలు- నేను ఈ ఉత్తరం ఈ విధంగా ఎందుకు రాస్తున్నానో గ్రహించగలవు...

★★★

*ఈ ఉత్తరం నువ్వు టైపు చేయించు. కాని రాతప్రతిని ఎవరిపరం చేయకు. అది నీ అధీనంలోనే ఉండాలి. శ్రీమతి మార్షల్‌ని ఒక టైపిస్టును పంపమని అడిగితే మంచిది. ఎందుకంటే ఈ విషయంలో ఆడవాళ్లను నమ్మవచ్చు. వాళ్లు ముఖ్యమైన విషయాలేమీ గుర్తుంచుకోరు. అంతేకాదు. టైప్ మిషన్ జాగ్రత్తగా వాడితే, దాని శబ్దం మన ఇంట్లో ఆడవాళ్లు నేర్చుకునే హార్మోనియం కంటే ఎక్కువ ఇబ్బంది పెట్టదు!*

మంచి కాగితం వాడండి. ఎక్కువ మార్జిన్ ఉంచండి. తప్పొప్పులు దిద్దు కోవాలి కదా!

ఈ తతంగం అంతా హారన్‌టన్ వీధి భవనంలో చేస్తే- ఆ టైపిస్ట్‌కు తలుపు సందులో నుంచి భోజనం పంపండి. అదే పోప్‌ను ఎన్నుకునే ముందు కార్డినల్స్‌కు ఆహారం ఇచ్చినట్లు: అలాగే టైపింగ్ అయి పోయిన

తర్వాత బాల్కనీలోకి వచ్చి ఆమె 'Habet Mundus Epistolam' అని ప్రపంచానికి చెప్పాలికదా! నిజాకిది Encyclical letter!

నిజానికి ఈ జైలు జీవితం ఎవరికైనా బయట వ్యక్తుల్ని, వ్యవహారాల్ని నిజాయితీగా పరిశీలించటానికి అవకాశం కల్పిస్తుంది.

వారంతా జీవనక్రమంలో పరిభ్రమిస్తూ ఒక అసత్య ప్రపంచానికి కారణభూతులవుతున్నారు. ఇక్కడ మేము బందీలుగా వున్నా చూడగలం– తెలుకోగలం. ఈ ఉత్తరం రాస్తున్నది ఒక వేళ మన సంకుచిత సమూహాలకు ఏమయినా మంచి చేయగలదా అని ఆశతో కాదు – నాకు మాత్రం చాలా మేలు జరుగుతుంది. 'నా మనసులోని ప్రమాదకరమైన భారాన్ని వదిలించు కున్నాను' – ఇది మనం ఒకసారి కష్టాలనుంచి నుంచి రక్షించాలనుకున్న కవి వాక్యాలే!

కళాకారునికి భావవ్యక్తీకరణే జీవిత పరమావధి అని నేను నీకు ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. కేవలం ఒక మాట (వ్యక్తీకరణ)తోనే బ్రతుకుతాం.

జైలు అధికారికి ఎన్నో విధాల ఋణపడి వున్నాను. ముఖ్యంగా, నాకు ఎంతైనా రాసుకునే అవకాశం కల్పించినందుకు!

రెండు సంవత్సరాలుగా నాలో ఒక చేదునిజం పేరుకు పోయింది. ఆ బరువు ఇప్పుడు దించుకుని, వదిలించు కుంటున్నాను.

ఈ జైలుగోడ ఆవలివైపు కొన్ని చెట్లు మసకబారిపోయి వున్నాయి. వాటి కొమ్మలు ఇప్పుడే పూతకు వచ్చి, పచ్చని పిందెలుగా విచ్చు కుంటున్నాయి. నాకు తెలుసు అవి తమ వునికిని చాటు కుంటున్నాయని.

★★★

వారం తరవాత ఇక్కడకు మార్చారు. మూడునెలలుగా, ఇక్కడే వున్నాను. ఇంతలో అమ్మ చనిపోయింది. ఆమెను ఎంతగా ప్రేమించాను, ఎంతగా గౌరవించానో ఎవ్వరికీ తెలియదు. ఆమె లేని లోటు నేను భరించలేనిది. కాని ఒకప్పుడు భాషమీద అధికారం చలాయించిన వాణ్ణి – ఇప్పుడు నా బాధను నా అవమానాన్ని చెప్పుకునేందుకు నాకు మాటలే కరవయినాయి.

నా తలిదండ్రులు నాకు వారసత్వంగా ప్రసాదించిన పేరు ప్రఖ్యాతులు, కేవలం సాహిత్యం, కళ, పురాతత్వం– విజ్ఞానశాస్త్రం, వాటిలోనే కాక, నా దేశ చరిత్రలో, దాని పరిణామ క్రమంలో కూడా వుంది. నేను దానికి మాయనిమచ్చ తెచ్చాను. అవమాన పరిచాను. నీచాతినీచంగా దిగజార్చాను. బురదలోకి లాగాను. మూర్ఖులకు అందించాను. పనికిరాని వాళ్ల పాలు చేశాను. నేను పడిన బాధ–ఇంకా అనుభవిస్తున్న వేదన–ఇది కాగితం మీద పెట్ట తగినది కాదు. నా భార్య–ఆమె దయ, కరుణ ఎప్పుడూ నాకందిస్తూనే వుంది. జెనోవా నుంచి–అంత జబ్బులో కూడా వచ్చి–చెప్పుకోలేని అవమానం, తిరిగి తెచ్చుకోలేని గౌరవం, మా జీవితాలలో ఎంత నష్టం జరిగిందో వణికే పెదవులతో చెప్పింది.



**రీడింగ్ కారాగారం**

ఓదార్పు సందేశాలు చేరుతూనే వున్నాయి. నా జీవితం లోకి చొరపడిన దుఃఖానికి సాంత్వన వచనాలు, తెలిసిన వాళ్ల దగ్గర్నుంచి, పరిచయం లేని వారినుంచి అందుతూనే వున్నాయి.

అవును, మూడు నెలలు గడిచి పోయాయి. నాగది బైట తగిలించిన అట్టమీద నా రోజువారీ ప్రవర్తన, నేను చెయ్యవలసిన కాయకష్టం రాసిపెడుతూనే వున్నారు. అదే గుర్తుచేస్తోంది. ఇది 'మే' మాసమని.

సంపద, సౌఖ్యం, విజయాలు ఇవన్నీ ఒక ముతక తాను ముక్కలే–కాని దుఃఖం మాత్రం అన్నింటి కంటే సున్నితమైనది.

బాధకు వణకని కణం లేదు భావ ప్రపంచంలో!

మనం కంటితో చూడగలిగిన, పండిపోయి రాలిపోతున్న ఆకుల కదలికలను తెలిపే గాలివాలు కూడా, కాస్త మోటు గానే వుంటుంది– కాని ప్రేమతో ఓదార్చే ఒక స్పర్శ – గాయాన్ని కరుణతో–బాధించ కుండానే–మళ్లీ రేపుతుంది.

ఈ జీవితం బాధతోనే పునీతమవుతుంది. ఏదో ఒక రోజు మనం దీనిని గుర్తించగలం– అప్పటి వరకు జీవితమంటే తెలియనట్లే...

★★★

నన్ను జైలుగది నుంచి దివాళాకోర్టుకు బేడీలు వేసి తీసుకొస్తున్నపుడు– అక్కడి కారాగారపు కారిడారులో చాలాసేపు – ఆ జనసమూహం ముందు నిలబడివున్నాము. వారి నిశ్శబ్దపు గౌరవసూచన ఎంత మధురంగా వుంది! అందులో ఒక వ్యక్తి తన టోపీ తీసి నాకు అభివాదం చేశాడు. నేను చేతికి బేడీలతో కనీసం తల కూడ ఎత్తుకో లేక పోయాను.

ఇంతకంటే చిన్న కార్యాలకే చాల మంది స్వర్గద్వారాలు చేరారుకదా. అదిగో అలాంటి ఉద్వేగం, ప్రేమకోసమే కదా, సాధువులంతా నేలకు వాలి పేదల పాదాలు కడుగుతారు - కుష్ఠురోగుల చెక్కిళ్లు ముద్దు పెట్టుకుంటారు!

ఇప్పటి వరకు అతని చర్యకు ప్రతిస్పందన కూడా చూపలేకపోయాను. కనీసం అతని అభివాదాన్ని గమనించానని అతనికి తెలుసో తెలియదోగదా. కృతజ్ఞతలు తెలియజేయటానికి అతని అభిమానం అమూల్యమైనది కదా.

నా గుండెల్లో పదిలంగా, అపురూపంగా దాచు కుంటున్నాను. నేనెప్పటికీ తిరిగి చెల్లించలేని ఋణం ఇది. ఈ విషయం సంతోషంగా అంగీకరిస్తాను- కన్నీళ్ళతో!

జ్ఞానం నాకు ఉపయోగపడనపుడు, తత్త్వం ఎండిపోయి నపుడు, నాకు సాంత్వన చేకూర్చవలసిన పదాలు- సామెతలు దుమ్ము-ధూళి లాగా నా నోటికి అడ్డుపడు తున్నపుడు- ఇదిగో, ఇతని ఈ చిన్న - మధురమైన అభివాదం నన్ను కరుణతో ముంచెత్తి వేసింది. ఎడారిలాంటి నా గుండెలో గులాబీలు పూయించింది. క్షతగాత్రులు, వికలాంగులతో పాటు ధైర్యంగా నిలబడేట్లు చేసింది.

ఏదో పైపై తీపి పలుకులతో గాక, అర్థం చేసుకునే మనసుంటే, ఇదంతా నాకు ఎందుకు ముఖ్యమైనదో తెలుసుకోవచ్చు. ఆ తెలివిడితోనే నాకు దగ్గర కావచ్చు-

పేదవాళ్ళు తెలివిగలవాళ్ళు- దాతృత్వం గలవాళ్ళు. దయగల వాళ్ళు, మనకంటే సున్నిత మనస్కులు. వారి దృష్టిలో జైలుజీవితం, దురదృష్టం! ఒక దుర్ఘటన, ఒక ప్రమాదం. ఎదుటవారి సానుభూతికై ఎదురు చూస్తుంది. జైలుపాలయిన వాడి గురించి మాట్లాడేటప్పుడు అరె

– అతనికి ఎంత కష్టం వచ్చింది. అని అంటారు. అందులో ఎంతో ప్రేమ సానుభూతి నిండి వుంటుంది. మనలాంటి వారి విషయంలో అది మరో విధంగా వుంటుంది. మనల్ని సాటివారు జైలుపక్షి అంటారు. నాలాంటి వాడికి గాలి, వెలుతురు కూడ తగలవు. మన వునికే ఇతరులకు ఇబ్బంది గలిగిస్తుంది. మనం కనపడితే ఆహ్వానం ఉండదు. మళ్ళీ వెన్నెల వెలుగులు చూసే అవకాశం మనకు లేదు. మన సంతానమే మనకు దూరమయ్యారు. మనవాళ్ళంతా వుండగానే, గాయపడిన హృదయాలకు లేపనం, ఆవేదన పడే ఆత్మకు సాంత్వన కరవయి పోయిందికదా–

నన్ను నేను నాశనం చేసుకున్నాను. ఎంతగొప్ప వాడయినా, అనామకుడైనా తనని తనే నాశనం చేసుకుంటాడు. ఇప్పటి నా దయనీయ స్థితికి, నా నిర్దయే కారణం. అవును ఈ ప్రపంచం నన్ను ధ్వంసం చేసింది. అంతకంటే ఎక్కువగా నన్ను నేను విధ్వంస పరుచుకున్నాను.

నా జీవిత కాలంలోనే నాగరకతకు, కళాప్రపంచానికి నేనొక చిహ్నంలా నిలిచాను. నా తొలియౌవనపు రోజులతోనే నేనీ విషయం గుర్తించాను. నా చుట్టూ వున్న ప్రపంచంతో ఈ నిజాన్ని అంగీకరింప జేశాను కూడా. చరిత్రలో చాలా కొద్దిమందికి మాత్రమే ఈ అవకాశం వుంటుంది. ఈ అరుదైన గుర్తింపు లభిస్తుంది. కాని విమర్శకులు, చరిత్రకారులు ఈ సత్యాన్ని గ్రహించగలరు– ఎప్పుడు? ఆ వ్యక్తి గతించిన తర్వాతే. నా విషయంలో అది భిన్నం–ఈ ప్రత్యేకతను నేను గ్రహించ గలిగాను. అంతే కాదు. ఇతరులూ గుర్తించే విధంగా చేయగలిగాను. బైరన్ (Byron) గుర్తింపు గల వ్యక్తి. కాని తన కాలానికి సంబంధించిన ఆసక్తి అప్పటికే సన్నగిల్లి పోయింది. నా విషయంలో ఈ ప్రత్యేకత ఎంతో గౌరవాన్ని శాశ్వతత్వాన్ని పొంద గలిగి అంతటా వ్యాపించింది!

★★★

దేవతలు నాకన్నీ ఇచ్చారు. నేను విపరీతపుటాకర్షణలకు లోనై అర్థంపర్థం లేని లౌకిక సుఖాలలో విషయలోలత్వంలో మునిగిపోయాను. వింత వింత వేషధారణలతో రూపలాలసతో ఆనందించాను. నా చుట్టూ అలగా రీతులను–పనికిరాని వాళ్ళను తిప్పు కున్నాను. నా మేధో సంపత్తిని వృధాగా ఖర్చు చేశాను. నా యౌవనాన్ని ఆవిరి చేసుకోవటం నాకు వింత ఆనందాన్ని యిచ్చేది.

ఈ ప్రక్రియలో ఉన్నత శిఖరాల నుంచి ఆగాధాలలోకి జారిపోయాను. నా ఆలోచనలలోని విరుద్ధభావాలు, నా ఆసక్తిని వంకర దారుల్లోకి నడిపించాయి.

కోరిక చివరకు దుఃఖాన్ని మిగులుస్తుంది. నా ఆనందం కోసం ఇతరులను నిర్లక్ష్యం చేశాను. నా కెక్కడ తృప్తి కలిగితే అదే ఆనందమనుకున్నాను. అలాగే ప్రయాణించాను.

ఈ ప్రయాణంలో ప్రతి చిన్న కార్యం, వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేస్తుందన్న సంగతి మరచిపోయాను. అందుకని–రహస్యంగా చేసిన చిన్నసంగతికూడా ఏదో ఒక రోజున బహిరంగపరచక తప్పదని మరిచిపోయాను. నన్నునేను నియంత్రించుకోవటం మానివేశాను. నా మనస్సును అదుపులో వుంచలేక పోయాను. అదీ తెలియకుండా జరిగిపోయింది. భౌతిక సుఖాల సుడిగుండంలో పడిపోయాను. చివరికి భయంకరమైన అవమానంలో కూరుకు పోయాను.

ఇక ఇప్పుడు నాకు మిగిలింది– అధోగతి. తలవంపులే. ఇప్పటికి రెండేళ్ళుగా ఈ జైలుగదిలో పడివున్నాను. నా ప్రవర్తనలో అంతులేని–వికారమైన నిరాశ పొడసూపుతోంది. దిక్కుమాలిన విచారం దయనీయంగా దర్శనమిస్తోంది.

భయంకరమైన ఆగ్రహం, అశక్తి వల్లనే దహించి వేస్తోంది. చేదు అనుభవం, అలక్ష్యం, తిరస్కారం, బిగ్గరగా ఏడ్వాలనే ఆరాటం, పైకి

చెప్పుకోలేని దురవస్థ– దౌర్భాగ్యం, అన్ని విధాలయిన బాధలు, వికారాలు, వేదనలు తెరలు తెరలుగా తరలి పోయాయి.

"ఆవేదన అంధకారమయం– నిగూఢమైనది, అనంత మైనది కూడా" అని వరడ్స్‌వర్త్ అన్న మాటల అర్థం నాకు బాగా తెలియవచ్చింది!

కాని నా కష్టాలకంతంలేదని అనుకున్నపుడు– ఆ భావనలో ఒక సాంత్వన, పొందాను. ఇవన్నీ కేవలం అర్థం లేకుండా భరించానా? ఇప్పుడనిపిస్తోంది– నాలో ఎక్కడో దాగిన లోగొంతు చెప్పటం వినిపిస్తోంది. ఈ ప్రపంచంలో అర్థం లేనిది ఏదీ లేదని. అందులోనూ 'బాధ'–

అలా నాలోపల దాగినది– ఒక పెన్నిధిలాగా నిక్షిప్తమైనది– **నా అవమానమే.** చివరికి మిగిలింది. నాలో మిగిలిపోయింది– అదే గొప్పది. బహుశా అదే నేను కనుగొన్నది. మరొక సరికొత్త మర్మం తెలియవచ్చింది. తెలుసుకోగలిగాను. ఇది సరైన సమయంలోనే బయటపడింది. ఎవరైనా తెచ్చినా తీసివేసే వాడినే, కాని అది నేను కనుగొన్నది కాబట్టి పోగొట్టుకోను. అవును తప్పనిసరిగా కాపాడుకోవాలి. ఇపుడు దానిలోనే జీవిత రహస్యాలు దాగివున్నాయి. కొత్త జీవితం చిగురిస్తుంది. Vita Nuova నాకు!

కాని ఎన్నో విషయాలలో, సంఘటనలలో అది చాలా వింతయినది. దాన్ని సాధించలేము. మనకున్నవన్నీ సమర్పించుకుంటేనే గాని అది లభించదు. అన్నీ పోయిన నాడే–దాని ఉనికిని గుర్తించగలం!! ఇప్పుడు నేను తెలుసుకోగలిగాను. కాబట్టి నేను చేయవలసిన కర్తవ్యం తెలియవస్తోంది.

ఇవన్నీ చెప్పేటప్పుడు–నన్ను ఏ బహిఃశక్తులు నియంత్రిచటంలేదు. ప్రోద్బలించనూలేదు. అవేమీ నేను అంగీకరించను.

ఇదివరకటికంటే కూడా ఇప్పుడు నా వ్యక్తిత్వం ప్రత్యేకత సంతరించుకుంది. నా అంతరంగపు ప్రబోధాన్ని మించి విలువైనది ఏమీ లేదు. ఇప్పుడు నన్ను నేను అర్థం చేసు కుంటున్నాను. ఇప్పటికిదే నా కర్తవ్యం. నేను చేయవలసిన మొట్టమొదటి పని– ఈ ప్రపంచం అంటే ద్వేషభావాన్ని వదిలించుకోవటం!

★★★

ఇప్పుడు నాకు గూడు లేదు. కూడు లేదు. కాని ఇంతకంటే విషాదకరమైన విషయాలెన్నో ప్రపంచంలో వున్నాయి. ఇక్కడ నుంచి బైటకు అడుగుపెట్టేందుకు సిద్ధంగానే వున్నాను. నాలో ఇప్పుడు ఏ ద్వేషభావము లేదు. ఇంత తిండి కోసం తిరిపెం ఎత్తుకోవటానికి గడపగడపకూ తిరగటానికీ వెనుకాడను. ఉన్న వాళ్ళు ఏమీ ఇవ్వకపోయినా, పేదలు ఇచ్చిందే తీసుకుంటాను. అవును ధనికులదెప్పుడూ లోభితనమే. నా మనసులో ప్రేమ వున్నంతకాలం నేను ఎక్కడ విశ్రమించినా, శీతగాలులు చలి, వేసవి విసుగు ఇవేమీ నన్ను బాధ పెట్టలేవు. ఇప్పటి నా మానసిక స్థితిలో భౌతిక (లౌకిక) సుఖాలు ముఖ్యంగా కాదనే అన్పిస్తోంది!

నీకు తెలుసుగా, నా అస్తిత్వపు సాంద్రత ఎంత ప్రగాఢమైందో. అవును ఈ స్థితికి చేరటానికి నేను చాలా చాలా దూరం ప్రయాణం చేశాను. నేను నడిచిన దారి ఎంత కర్కశమైనది! నా అడుగులు పడిన చోటల్లా రక్కిస పొదలే మరి!

అయినా రోడ్ల మీద అడుక్కోవటం నా నైజం కాదని నీకు తెలుసు. ఎప్పుడైనా, మంచులో తడిసిన పచ్చిక మీద పడుకుంటే–అది చందమామకు ప్రేమలేఖ రాయటానికే.

ఇక్కడ నుంచి బైట పడినపుడు– రాబీ, ఆ మందపాటి ఇనుపతలుపుల కావైపు నాకోసం ఎదురు చూస్తుంటాడు. అతని వాత్సల్యానికి గుర్తుగా ఇంకా మిగతా వారి అభిమానానికి మూర్తిగా నిలబడే ఉంటాడు!

ఇంకా పద్ధెనిమిది నెలలు బ్రతకాలి. తరువాత నేను మంచి పుస్తకాలు రాయలేక పోవచ్చు–కాని మంచి పుస్తకాలు చదువుకోవచ్చు కదా–అంతకంటే ఆనందం ఏముంటుంది?

ఆ తర్వాత నా సృజనాశక్తిని మళ్ళీ వెలిగించుకోవాలి. కాని నాకు ఒక్క స్నేహితుడు లేడు. ఒక్క ఇంటి తలుపూ నాకోసం తెరచిలేదు. ఎవరి దయాదాక్షిణ్యం మీద ఆధారపడాలి? ఈ తిరస్కారం–కాఠిన్యం–తృణీకరణ నుంచి విడుదలయితే అప్పుడు–ఈ జీవితం ప్రశాంతంగా, ఆ విశ్వాసంతో, బైటకు అడుగుపెట్టి–నూలు దుస్తులు ధరించవచ్చు.

ఇంత సంకటంలోనూ నాకేమీ కష్టం లేదు–నీవు నిజంగా–మనస్ఫూర్తిగా కోరుకుంటే–నీకోసం నీకు కావలసిన వాళ్ళు వేచివుంటారు.

ఇంతటితో నా కర్తవ్యం తీరిపోయిందా? కాని అలా జరిగితే ఎంత బాగుండును–ఇంకా చేయవలసింది ఎంతోవుంది–ఎన్నో ఎత్తైన కొండలు ఎక్కాల్సి–వుంది; ఎన్నో చీకటిలోయలు దాటాల్సి వుంది. ఇదంతా ఒంటరిగానే చేయాలి. ఈ విషయంలో, నైతికత, మతం, వివేకం ఇవేమీ నాకు సహాయపడవు!

నీతిగా వుండటం ఒక్కటే నాకేమీ వుపయోగపడదు. నేను పుట్టుకతోనే మతానికి దూరంగా వున్నాను. అన్నింటికీ వ్యతిరేకంగా, చివరికి చట్టానికి కూడా, వుండి పోయాను. మనం చేసే పని ఏదీ తప్పుకాదనుకుంటే – ఆ కార్యాల ద్వారానే మనల్ని అంచనా వేస్తారు. ఆ విధంగా నేర్చుకోగలిగితే మంచిదే– మతమూ నాకు సహాయకారి కాదు–మరొకరి విశ్వాసం–అదీ మనకు దర్శనమీయనిది, సహాయం ఎలా చేస్తుంది?




నేను స్పర్శ ద్వారానే నమ్మకాన్ని ఇచ్చాను–దాని ద్వారానే నేను చూశాను. నా దేవుళ్ళందరూ– చేతులతో తయారయిన దేవాలయంలోనే వుంటారు. అనుభూతి వృత్తాలలోనే నా మతం నిక్షిప్తమయింది. అక్కడే ఆవిష్కరించబడింది. అదే–అందమైన భూతలస్వర్గంగా కనుగొన్నాను. అంతేకాదు, అక్కడే, భయానకమైన నరకాన్ని చూశాను.

నేను మతం గురించి ఆలోచించినపుడు నమ్మకం లేని వాళ్లకు ఒక పద్ధతిని తెలియ జెప్పాలనుకుంటున్నాను. నాస్తిక సమాహారం అనవచ్చు. వీరికోసం ఖాళీ సిలువ, నమ్మకంలేని పూజారి, కుళ్లిన రొట్టెముక్క, ఖాళీ వైనుగిన్నె! సత్యమయిన వన్నీ మతంలా మారాలి. అలాగే నాస్తికులందరకూ అన్ని రకాల కర్మకాండలన్నీ వుండాలి. వీరి త్యాగమూర్తులు వీరికున్నారు. వీరి సన్యాసులు వీరికున్నారు–వీరూ రోజూ దేవుణ్ణి కీర్తిస్తారు–మనిషికి కనపడకుండా దాగివున్నందుకు!

కాని అది విశ్వాసమైనా, నాస్తికమయినా, అది నాకు భౌతికంకాదు. దాని గుర్తులు నా సృజన కావాలి. ఏదయితే ఆధ్యాత్మకమో, అదే మూర్తి

మంతంకావాలి. దాని రహస్యాలు నాలో నేను ఛేదించలేకపోతే, నాకెలా దాన్ని గురించి తెలుస్తుంది? ఇప్పటికీ నాకు తెలియరాకపోతే–ఇక ఎప్పటికీ తెలియదు. జ్ఞానం కూడా నాకు సహాయం చేయలేదు – ఎందుకంటే, ఈ చట్టాలు, చట్రాలు, నన్ను–నాప్రవర్తనను తప్పుపట్టి శిక్షించాయి. ఈ అవ్యవస్థలోనే నాకీ అవస్థ పట్టింది. కాని నేను రాజీపడక తప్పదు. (కళారూపాలలో) కళలో ఏ విధంగా ఒక సందర్భంలో–ఒక విషయం ఆవిష్కృత మవుతుందో, ఒక వ్యక్తి నైతిక స్వరూపంలోకూడా అంతే–పరిణామక్రమం ఉంటుంది.

ఇంతవరకూ నాకు సంభవించిన సంఘటనలన్నీ మంచిగానే తీసుకోవాలి. ఈ చెక్కమంచం, కంపుగొట్టే రొట్టిముక్క, పీచుతో పేనే తాళ్లరాపిడికి మొద్దుబారిన చేతి వేళ్లు –రోజువారీ నీచమైన చిల్లర పనులతో గడిచిపోయేకాలం; వార్డెన్ వాళ్ల అరుపులు; అవమానకరమైన దుస్తులు; దు:ఖాన్ని దిగమింగే నిశ్శబ్దం; చేతగాని ఒంటిరితనం; లజ్జాకరమైన ఏవగింపు, వీటన్నిటినీ నేను–ఆధ్యాత్మక వస్తువులుగా మార్చుకోవాలి. భ్రష్టమవుతున్న ఈ శారీరక కదిలికలన్నీంటినీ ప్రతి అనుభవాన్ని ఆత్మ సంబంధమైన అధ్యయనంగా తీసుకోవాలి!!

ఒక్క విషయం సూటిగా చెప్పాలి. నా జీవితంలో రెండు స్పష్టమైన మలుపులున్నాయి–ఒకటి నాన్న నన్ను ఆక్స్‌ఫర్డ్‌కు పంపించటం! రెండోది–ఈ సామాజికవ్యవస్థ నన్ను జైలుకు పంపటం!!

జైలుకు రావటం గొప్ప విషయంగా నేను చెప్పటం లేదు. అలా అంటే, నన్ను నేను అవమానపరచుకోవటమే. నా చిన్న తనం నుంచీ, నేను ప్రత్యేక రీతిలోనే ప్రవర్తించాను. వ్యతిరేకంగానే నడిచాను. దానితోనే నా జీవితంలో మంచి విషయాలన్నీ విషపూరితాలయినాయి. చెడు సంగతులన్నీ మంచిగా మారాయి–

★★★

ఎవరేమి చెప్పినా, నాతోసహా, దానికి విలువేలేదు. అసలు ముఖ్యమైనది ఇప్పుడు నా ముందున్నది నేను చెయ్యవలసిన– కర్తవ్యం– జరిగిపోయిన రోజుల గుర్తులను– మరచిపోతూ–చెరిపి వేసుకుంటూ –నాలో వాటి ప్రభావాన్ని దిగమింగుకొని–నా అంతర్భాగంగా భయపడకుండా అంగీకరించి ముందుకు కదలటమే ముఖ్యం– అన్నింటిలోకీ దౌర్భాగ్యమైనది లేకితనం. ఏదైతే తెలుసుకో గలుగుతామో అదే సత్యమైనది!

★★★

నన్ను కారాగారానికి తీసుకువచ్చిన కొత్తలో– నేనెవరో, నన్ను మర్చి పొమ్మని అన్నారు కొందరు. ఆ సలహా నన్ను నాశనం చేసేది. నన్ను నేను తెలుసుకోవటంలోనే నాకు ఎంతో కొంత ఊరట ఉంటుంది. నెమ్మది కలుగుతుంది. ఇప్పుడు మరి కొంతమంది – నేను విడుదలయిన తర్వాత – ఈ జైలు గది సంగతే మర్చి పొమ్మంటున్నారు.

ఇదికూడా చాలా ప్రమాదకరమైన ఆలోచనే అని తెలుసు. అలా చేస్తే భరించశక్యంకాని అవమాన భారం నన్ను వెంటాడుతూనే వుంటుంది. ప్రకృతి అందాలు– పగటి వెలుగు – రాత్రివెన్నెల, ఋతువుల సోయగాలు – ఉషోదయపు కిలకిలా రావాలు – నిశిరాత్రి నిశ్శబ్దం – వాన చినుకులు ఆకుల్లోంచి రాలటం – పచ్చిక మీద మంచు బిందువుల పరచుకోవటం – ఇవన్నీ నాకు మసకబారి పోతాయి– నాకు సాంత్వన కలిగించలేవు– నాకు సంతోషాన్ని అందించలేవు! మన అనుభూతులను గురించి విచారించటం– మన అభివృద్ధిని నిరోధించటమే కదా– ఇది మన అంతరంగాన్ని కాదనుకోవటమే కదా–

మన శరీరం అన్ని హరాయించు కుంటుంది. మంచి – చెడు– పవిత్రము – అపవిత్రమైనవన్నీ కూడా మన కండరాలుగా, శక్తిగా, మన

రక్తమాంసాలుగా, వంకీల జుత్తుగా, ఎర్రని పెదవులుగా, మెరిసే కన్నులుగా, మార్చు కుంటుంది. అలాగే అంతరంగపు ఆలోచనలు కూడా – భావోద్వేగాలు – వాటిలోని క్రూరమైన – అవమాన కరమైన కోణాల నుంచి గొప్ప విశ్వాసం బహిర్గత మవుతుంది – పుటంపెట్టిన బంగారంలాగా మెరుపు వస్తుంది! ఈ అతిసాధారణ కారాగారంలో నేను సాధారణ ఖైదీ ననే సంగతి అంగీకరించాలి. నేను అనుభవించే శిక్ష వలన నేను అవమానభారం భరించనపుడు – ఇంక ఈ శిక్షకు అర్థం ఏముంటుంది?

నేను చేయని నేరాలకు నాకు శిక్ష విధించారు. అలాగే నేను చేసిన చాలా 'పనులకు' నన్ను శిక్షిస్తున్నారు. ఇంకా నా జీవితంలో నా చాలా కర్మలకు శిక్షలేకుండానే ఉండిపోతాను.

దేవుళ్ళు వింత అయినావాళ్ళు సుమా ! మన మంచినీ–మానవత్వాన్ని–మన చెడునీ, వక్రనడతనూ అన్నింటినీ సమంగానే శిక్షిస్తారు!

అందుకనే–మన కర్మలన్నింటికి–మంచి–చెడు– అన్నింటినీ మనకు శిక్షపడక తప్పదు. అదే సరైన న్యాయమను కుంటాను. అలా జరిగినప్పుడే– మన భ్రమలన్ని తొలిగిపోతాయి. అపుడే అది అవమానం నుంచి మనలను రక్షిస్తుంది. అపుడే నేను సరిగా ఆలోచించగలను– హాయిగా స్వేచ్ఛగా బయటకు వెళ్లి జీవించగలను–

చాలామంది విడుదలయిన తర్వాత కూడా జైలు వాతావరణాన్ని తమతో తీసుకు వెళ్తారు– ఆ అవమానంతో కుళ్లిపోతూ చివరికి మరణిస్తారు. నిజానికి ఇది చాలా బాధాకరమయిన విషయమే. దీనికి బాధ్యత సంఘానికీ వుంది. ఒక రకంగా వారి మరణానికి బాధ్యత సాంఘికమైనదే. అంతేకదా– తప్పు చేసిన వాళ్లను శిక్షించే బృహత్తరమైన




బాధ్యత తలకెత్తుకున్నపుడు– ఆ శిక్ష అనుభవించి– విడుదలయిన వాళ్ల బాధ్యతకూడా దానిదేకదా– ఇంతటి ముఖ్యమైన విషయాన్ని గుర్తించక పోవటం నేరమేకదా–శిక్ష అనుభవించిన వాడిని అతని మానానికి అతన్ని వదలివేయటం– లేదా అతనికి ఎంతో అవసరమైన సమయంలో – అతణ్ణి నిర్లక్ష్యం చేయటం– తన, ముఖ్యమైన ధర్మాన్ని నిర్వర్తించక పోవడమే. ఇది ఎంతో సిగ్గుపడవలసిన విషయం– సంఘపరమైన బాధ్యతను నెరవేర్చకుండా–అతడు కనపడితే– ఏదో బాకీ వున్నా వాడి నుంచి తప్పించుకొన్నట్లు ముఖం చాటువేయటం– ఈ జనానికి న్యాయమేనా? ఇంక శిక్షించబడిన వాడు – మళ్లీ సంఘంలో సాధారణ జీవితాన్ని గడిపే వాతావరణం కల్పించక పోవటం–దానికి అతనికి అర్హత లేదనట్లు ప్రవర్తించటం ఎంతవరకు సబబు?

★★★

**నా**వరకు నేను నా బాధలు గుర్తించ గలిగినపుడు – అలాగే ఈ సంఘంకూడా ఈ విషయంలో తన బాధ్యతను గుర్తించి నా సాధారణ జీవితానికి వాతావరణం కల్పించాలి కదా–

ఒక విధంగా – ఇతరుల కంటే నా విషయంలో పరిస్థితులు భిన్నంగా వుంటాయని తెలుసు– నిజానికి నా కేసు అట్లాందిదే కదా. పాపం, దొంగలు – మిగతా చిల్లర నేరస్తులు ఇక్కడే నాతో పాటు బంధించ బడ్డారు– వాళ్లు చాలా విషయాల్లో నాకంటే అదృష్టవంతులు.

ఇదిగో ఈ పట్టణంలోగాని, పల్లెల్లోగాని, వీరి నేరాలు చాలా చిన్నవిగానే పరిగణిస్తారు. అంతేకాదు– ఆ నేరాలు తెలియకుండా చేసిన వాళ్లు – అమాయకులు – వాళ్ల పరిధి చాలా చిన్నది – రాత్రిపూట పక్షి ప్రయాణం చేయగలిగిన దూరమే– కాని నా విషయంలో ? అది చాలా విస్తృతమైనది. నేను ఎటు తిరిగితే అక్కడ నాపేరు చెక్కబడి వుంది– నేను శూన్యంలో నుంచి రాలేదు– అంతులేని కీర్తి శిఖరాల నుంచి అపఖ్యాతి లోయలలో పడిపోయాను. ఒక్కోసారి అనిపిస్తుంది. కీర్తికి–అపకీర్తికి ఒక్క లక్ష్మణరేఖ మాత్రమే మధ్యలో వుందని–

నేను ఎక్కడకు వెళ్లినా ప్రజలు నన్ను గుర్తుపడతారు. నా జీవితాన్ని, నా దుష్కర్మలను, దోషాలను ఎత్తిచూపుతారు. ఇదంతా మంచికే– ఈ వత్తిడిలో నన్ను నేను నిరూపించు కోవాలి. నా ప్రతిభను వెలికి తీసుకువచ్చి ఒక అద్భుతమైన సృజన చేస్తే– నా పై వ్యతిరేకతతో, నన్ను ఎగతాళిచేసే పిరికిపందలకు–నన్ను హేళన చేసే మూర్ఖులకు సమాధానం చెప్పగలను!!

నాకు జీవనం సమస్య చేస్తే నేనుకూడా వారికి సమస్యగానే తయారవుతాను. నా పట్ల ప్రజలకు నిర్దుష్టమైన వైఖరి ఏర్పడాలి. అది ఇరుపక్షాలకు న్యాయపరంగా వుండాలి.

నేను మాట్లాడేది ఏ ఒక్కరో, ఇద్దరో గురించి కాదు– ఇప్పుడు నేను ప్రముఖంగా గుర్తించేది– కళాకారులు, బాధాతప్త హృదయులు, సౌందర్యోపాసకులు, దుఃఖపులోతులు తెలిసిన వారు! వారు మినహా మిగతావారితో నాకు పని లేదు. అంతేనా– ఈ శేషజీవితంలో నాకు

వేరే అడగవలసిన అవసరాలేమీ లేవు. ఇప్పుడు చెప్పిన దంతా– నా జీవితం పట్ల నా మానసికస్థితే– ఈ శిక్ష అనుభవించి నందుకు నేను సిగ్గు పడటంలేదు అనే ఒకే ఒక్క కార్యాన్ని సాధించాలి– అదీ నన్ను నేను పరిపూర్ణుడుగా సంస్కరించు కోవటానికి – ఎందుకంటే నేను చాల లోపభూయిష్టుణ్ణి కదా!

ఇప్పుడు సంతోషంగా వుండడం ఎలాగో నేర్చుకోవాలి. ఒకసారి ఈ విషయం సహజంగా నాకు తెలిసి నపుడు – ఇక నా మనసులో వసంతమే! స్వభావ సిద్ధంగానే నేను సంతోషిని. ఇప్పటి వరకూ నాజీవితాన్ని ఆనందమయం చేసుకున్నాను, మధుపాత్ర నింపినట్లు! ఇప్పుడు నా దృక్పథాన్ని పూర్తిగా మార్చుకున్నాను. ఇక సంతోషమంటే ఏమిటో కూడా నాకు తెలియక పోవచ్చు!

ఆక్స్‌ఫర్డ్‌లో పీటర్ 'రినైజాన్స్' పుస్తకం చదివిన జ్ఞాపకాలు– ఆ పుస్తకం నన్ను పూర్తిగా మార్చివేసింది. వింత ప్రభావానికి లోనయ్యాను. డాంటే– 'ఇన్‌ఫెర్నో'లో స్వభావసిద్ధంగా దుఃఖంలో వుండే వారిని– ఎంత పాతాళంలో వున్నట్లు చూపాడు?

అలాగే 'డివైన్ కామిడీ'లో చివరికి 'చవిటి నేలలో వుండే వారు కూడా– చల్లటి గాలిని' ఎలా పీల్చగలరో చదివాను.

మతం అనాధ్యాత్మికతను నిరసిస్తుంది. కాని ఈ ఆలోచన చాలా కొత్తగా వుంది. ఒక మతాధికారి నిజజీవితం తెలియకుండా పాపపుణ్యాలను ఏ విధంగా నిర్ణయిస్తాడు? డాంటేని కూడా సరిగ అర్థం చేసుకోలేకపోతున్నాను– 'మనల్ని దుఃఖమే దేవుని దగ్గరకు చేరుస్తుందని' అన్నపుడు– బాధే సౌఖ్యమని ప్రేమించేవారి సంగతి ఏమిటీ అనుకొని– దీనిలో ఎంత వరకు నిజముంటుందని సంకోచించాను. కాని ఏదో ఒక రోజు అదే నా జీవితంలో అనుభవంలోకి వస్తుందని నాకెలా తెలుస్తుంది?

నేను 'వాండ్స్‌వర్త్' జైలులో వున్నపుడు–చనిపోవాలని తపించాను. అదే నా ఏకైక కోరిక!

తర్వాత రెండు నెలలు అనారోగ్యంతో వైద్యశాలలో వున్నతర్వాత, ఇక్కడకు మార్చబడ్డాను. ఇక్కడకు వచ్చిన దగ్గరనుంచి నా పరిస్థితి మెరుగుపడుతూనే ఉంది శారీరకంగా. కాని నాలో కోపం రగులుకు పోతోంది. అప్పుడే – జైలు నుంచి బైటకు విడుదలయిన రోజునే ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకున్నాను. కొంత కాలానికి ఆ దుర్మార్గపు ఆలోచన నన్ను వదిలిపోయింది. బ్రతకాలనే నిర్ణయానికి వచ్చాను. కాని దుఃఖపు కిరీటాన్ని పెట్టుకొని, ఎప్పుడు చిరునవ్వు కూడా లేకుండా, నేను అడుగుపెట్టిన చోటల్లా విచారగ్రస్తమయిన లోగిల్లా మార్చి– నా స్నేహితులను నాతోపాటు విషణ్ణ వదనాలతో నడిపించాలని– వారికి వ్యాకులతే జీవిత రహస్యమని తెలియ జెప్పాలని, వారిది కాని దుఃఖంతో వైకల్యం కలిగించాలని, నా బాధతో వారిని చెరచాలనీ అనుకున్నాను. కాని ఇపుడు భిన్నంగా ఆలోచిస్తున్నాను. వారితో నిశ్శబ్దంగా కూర్చొని – సంతోషంగా వుండటం అలవాటు చేసుకోవాలని–అనుకుంటున్నాను.

నా స్నేహితులు నన్ను చూడటానికి వచ్చిన రెండు సందర్భాలలో వారితో వీలయినంత సంతోషంగానే వుండటానికి ప్రయత్నించాను. వారుకూడా నాపట్ల దయతో ఇంత దూరం రావటానికి తీసుకున్న శ్రమను నేను గుర్తించానని తెలిసేట్లుగానే ప్రవర్తించాను. ఇది వారికి ఆనందాన్నే కలిగించి వుండాలి. శనివారంనాడు 'R' తో ఒక గంటపాటు గడిపాను. అప్పుడే నా మానసికోల్లాసాన్ని పూర్తిగా వెలిబుచ్చ గలిగాను. అదీ నా ఆలోచనలను– ప్రవర్తనను ఎలా మార్చుకుంటున్నానో– తెలుసుకుని, ఈ జైలుగదిలోకి నెట్టబడిన తర్వాత మొదటిసారిగా జీవితంమీద ఆశ పెంచుకున్నాను.

నా ముందు–నేను నెరవేర్చ వలసిన కర్తవ్యం – ఎంతో వుంది. అందులో ఏ కొద్దిగా చేయకుండా చనిపోయినా అది ఎంతో ఎంతో విషాదకరమైన సంఘటనవుతుంది.

ఇపుడు కళాకారుల్లో, సాహిత్యంలో ఎన్నో మార్పులు వస్తున్నాయి. అవన్నీ ఒక సంపూర్ణ స్థితికి చేరుతున్నట్లని పిస్తోంది. అదిగో ఆ కొత్త ప్రపంచాన్ని చూడటానికి– బ్రతికి వుండాలని కోరుకుంటున్నాను. ఈ నూత్న ప్రపంచాన్ని నీకు తెలుసు కోవాలని వుందా? అది నీవూహించగలిగిందే– నేను ఇంతవరకు గడిపినదే – దుఃఖం– ఆవేదన ఇవి నాకు సమస్తమూ నేర్పిన ప్రపంచం!!

★★★

ఇప్పటి వరకూ కేవలం సుఖాన్వేషణలోనే గడిపాను. భాధ – దుఃఖాన్నుంచి దూరంగానే వుండి పోయాను. ఈ రెంటిని అసహ్యించుకున్నాను. వాటిని అనవసరమైనవని ఉపేక్షించాను. అవి నా బ్రతుకుతీరులో భాగం కాదనుకున్నాను. నా తత్త్వంలో వాటికి స్థానమే లేదుకూడా.

అమ్మకు జీవితపు లోతులు తెలుసు. తరచూ చెప్పిన వాక్యాలు– కార్లైల్ వ్రాసిన పుస్తకంలోనివి – నాకు వినిపిస్తూండేది.

'దుఃఖిస్తూ భోజనం చేయని వాడు – శోకంతో రాత్రి గడుపుతూ – ఉదయం కోసం ఎదురు చూడని వాడు – అతనికి దేవుని శక్తి తెలియదు!' అని.

ఇవే వాక్యాలు – ప్రష్యారాణి తన ప్రవాసంలో– అవమానభారంతో వున్నపుడు చెప్తుండేది, నెపోలియన్ కాఠిన్యానికి లోనయికూడా–




ఇవే మాటలు అమ్మ తన జీవన సంధ్యాకాలంలో - కష్టమైన సమయంలోనూ వినిపిస్తుండేది - వీటిని నేను పూర్తిగా నిరసించాను. ఆ వాక్యాలలోని గూఢార్థాన్ని అంగీకరించటానికి నా మనసొప్పలేదు. అమ్మతో అనేవాడిని - నేను దుఃఖంతో తినను-రాత్రిళ్లు ఏడుస్తూ గడపనమ్మా- అని ! కాని విధి నాకోసం సరిగ్గా అటువంటి ప్రత్యేక విషయాలు దాచి పెట్టిందని నా కెలా తెలుస్తుంది. పైగా సంవత్సరం పాటు మరే పని లేకుండా ! ఆ విధంగా నా కష్టాల వాటా నాకు దక్కినట్లే- చివరి చివరికి నాకష్టాలు- కడగండ్లు అనుభవిస్తూ - ఆ వాక్యాలలోని దుఃఖార్తిని అర్థం చేసుకున్నాను. కొంతమంది మతపెద్దలు కష్టాలనుభవించ కుండానే అదొక మార్మిక విషయంగా చెప్పుకొస్తారు. ఇది తెలివి తక్కువ తనమే. బాధ అనుభవపూర్వకమే, ప్రత్యక్షంగా!

చరిత్రను వేరే కోణంనుంచి చూడాలి - సహజంగా మనకు మసక మసకగా కనిపించేవి - కళాసాహిత్యాల అవగాహన - అది పూర్తిగా అర్థం చేసుకుని స్పష్టంగా దర్శించాలి!

ఇప్పుడు నా దుఃఖానుభూతి, మనిషి భరించ గలిగిన భావోద్రేకపు తీవ్రత!, అదే కళకు అంతిమ పరీక్ష! ఒక కళాకారుడు భవ-భావాలను ఏకీకృతం చేసి చూడాలని తపిస్తుంటాడు - భౌతిక, బాహిర విశదీకరణ - అంతరంగ వేదనే. ఇలాంటివి చాలానే వుంటాయి. కేవలం కళారూపాలే కాదు. యౌవనోద్రేకాలు కూడా - ఈ విధంగానే వుంటాయి. క్లిష్టమూ

సున్నితమూ అయిన ముద్రలు – భౌతికమైన దుమ్ము, గాలి, మంచుతో నిండినట్టి వాతావరణంలో ఆధునిక ప్రకృతి కళా రూపాలు – ఒకప్పుడు గ్రీకులు సాధించిన పరిపక్వతను – రంగుల మేళవింపులో – భావ వ్యక్తీకరణలో సాధించటానికే ప్రయత్నిస్తున్నాయి. అలాగే అన్నీ తనలో లీనం చేసుకోగలిగిన సంగీతం కూడా దీని నుంచి విడదీయదగినది కాదు. దీనికి తేలికగా చెప్పగలిగిన ఉదాహరణలు లేవు – కాని దుఃఖమే జీవితంలోను కళలోను తుట్టతుది గురుతు – కట్టకడపటి ఆనవాలు – చిట్టచివరి చిహ్నం !

★★★

మన నవ్వుల్లో ఒక నిర్లక్ష్యపు సంకేతం, మన సంతోషంలో ఒక మోటుదనం దాగి వుండవచ్చు– కాని వేదనకు వెనక ఎప్పుడూ దుఃఖమే వుంటుంది.

బాధ, సంతోషంలాగా, ఎలాంటి ముసుగు వేసుకోదు. సృజనలోని సత్యం – అవసరమైన ఆలోచన నుంచి హఠాత్తుగా సంభవించే ఆవిష్కరణ కాదు. అది నీడకు ఆకారం కాదు. అద్దంలో ప్రతిబింబం కాదు. లోయల నుండి ప్రతిధ్వనీ కాదు – వెన్నెల వెలుగులో చంద్రుడు కనిపించే ఒక నీటి సెల...

కళలో సత్యస్వరూపం, స్వతసిద్ధం– బాహిరంతరాల అద్వైతం! అంతరంగపుటావిష్కరణ. భవ–భావ సమీకరణ.

దీని కారణంగా – దుఃఖంతో పోల్చదగిన సత్యం లేదు. ఒక్కోసారి అన్పిస్తుంది– దుఃఖమే పరమసత్యమని. మిగతావన్ని కేవలం భ్రమలేనని. నిజానికి బాధలో నుంచే మన ప్రపంచాలన్ని నిర్మించబడ్డాయని. శిశువు జననంకానీ– నెబ్యులాలో నక్షత్రంకానీ– అన్నీ బాధ, ఘర్షణలు నుంచే జనిస్తున్నాయి కదా !

ఇంతకంటే, బాధలో ఇంకా ప్రగాఢమైన అసాధారణమైన సత్యం వుంది. ఇంతకు ముందు చెప్పినట్లు - కళా సాహిత్యాలకు అనుసంధానమైన చిహ్నంగా నేను నిలిచానని- ఎందుకంటే బాధ - వేదనే జీవితరహస్యం! ఆ రహస్యమే అన్నింటి వెనక వుంది. మనం జీవించటం తెలుసుకున్నపుడు - జీవితం మొదలయినపుడు- ఇష్టమైనవి ఇష్టంగా, కష్టమైనవి కష్టంగా తీసుకున్నా - మన ప్రయత్నాలన్నీ సుఖాన్వేషణ చేసేందుకే ఎక్కువ కాలం వుంటాయి. ఈ ప్రక్రియలో- మన అంతరంగాన్ని అణచి వేస్తుంటాము.

ఇదే విషయం- ఇంతవరకు నాకు తెలిసిన వాళ్లందరిలోకి అత్యంత మనోహర వ్యక్తిత్వం గల స్త్రీతో మాట్లాడిన గుర్తు.

ఆమె నా పట్ల ఎంతో గౌరవ పూర్వకమైన దయ చూపింది- ఈ దురదృష్టకరమైన బందిఖానాకు రాక పూర్వం- వచ్చిన తర్వాత కూడా.

నేను మాటల్లో చెప్పుకోలేని ఆమె కరుణ - ఆమె సహాయం, నా బాధలన్నింటినీ భరించగలిగిన శక్తిగల ఏకైక వ్యక్తిగా నా ముందర నిలిచింది. దీనిలో ఎంతో వాస్తవం వుంది. కొంత ప్రభావ పూరితమైన స్థితి ఉంది- ఆమె సన్నిధిలో నాకు కలిగిన సాంత్వన - అది సాధారణమైనదిగానే అనిపించినా - వెచ్చని ఎండలాంటిది - సాగర తీరం లాంటిది. సుఖదుఃఖాలు చెట్టాపట్టాలు వేసుకుని నడిచినట్లుండేది.

ఆ సమయంలోనే నేను ఆమెతో చెప్పిన జ్ఞాపకం. "చూడండి - ఈ విశాల నగరంలోని ఒక చిన్న వీధిలో ఎంత విషాదం నిండివుందో - ఇది చాలదా - దేవుడు నిర్దయుడని చెప్పటానికి, మానవుణ్ణి ప్రేమించడని వాదించటానికి -" అన్నాను.

'ఓ చిన్ని పాప తెలిసీ తెలియక చేసిన చిన్న తప్పుకు ఏడవటం- ఈ సృష్టి మొత్తానికి మచ్చ కాదా!' అని కూడా అన్నాను.

ఆమె కాదంది! నేను మాట్లాడేది తప్పంది! కానీ నేను నమ్మలేదు– అప్పుడు అది నమ్మే స్థితిలో కూడా లేను– కాని ఆమె మాటల్లోని సత్యం ఇప్పుడు ద్యోతకమవుతోంది. ఈ ప్రపంచంలోని వ్యాకులత అంతటినీ తెలుసు కోవటానికి ప్రేమ ఒక్కటే మార్గమని, ఇంతకు ముందన్నట్లు – బాధలోనుంచే ఈ ప్రపంచాన్ని నిర్మించామని – అవును దాన్ని నిర్మించిన హస్తాలు ప్రేమస్వరూపాలు – అదొక్కటే మార్గం – మనిషి అంతరంగపు పరిపూర్ణత సాధించటానికి – ఈ ప్రపంచం అస్తిత్వమే దాని మీద ఆధారపడివుంది.

అందమైన శరీరానికి ఆనందం – అందమైన అంతరంగానికి అనంతమైన వేదన ! –

ఇవన్నీ నేను నమ్ముతున్నానని గర్వంగా చెప్పగలను. సుదూర తీరంలో, కడిగినముత్యంలా అనంతస్వరూపుని నివాసం చూడవచ్చు, అది ఎంత అద్భుతంగా వుంది! వేసవి వెలుగులో పసివాడు కూడా అందుకో గలడనిపిస్తుంది. నిజానికి పసిబాలుడు అందుకుంటాడు.

కాని నా పరిస్థితి వేరు. ఒక్కసారిగా తెలిసినట్లుంటుంది. కాని మొద్దుబారిన కాళ్ళతో కదలలేనపుడు – అది తెలియకుండా కాలంలో కలిసిపోతుంది.

అంతరంగం చేరగలిగిన ఉన్నతశిఖరాలను నిలుపు కోగలగటం చాలా కష్టసాధ్యమైన కార్యమే– మనం అనంతమైన ఆలోచనలు చేస్తుంటాము – కాని కాలం మెల్లగానే కదులుతుంది. అది జైలుగదిలో వున్నపుడు అసలు కదలదని వేరుగా చెప్పవలసిన పనిలేదు. ఆ జైలుగదిలాంటి మనసులోకి నిరాశానిస్పృహలు చీకటిలా అలుముకుంటాయి. వాటి ప్రవేశంకోసం, గుండెగూటిని కడిగి ముగ్గుపెట్టాలి. ఆహ్వానించని అతిథి వస్తున్నట్లు – కఠినాత్ముడైన యజమాని, అపరిచితుడైన బానిస రాకకోసం!!

ప్రస్తుతం నా వాళ్ళు ఇది నమ్మకపోయినప్పటకీ - వారు స్వేచ్ఛాజీవితంలోని సుఖాలనుభవిస్తున్నారు కాబట్టి-అవమానాలు గురించి తెలుసుకోవటం తేలికే కాని నా పరిస్థితి వేరుగా వుంది - మోకాళ్ళ మీద కదులుతూ ఈ జైలుగదిని కడగాలి ఉదయమే - ఈ జైలు జీవితం - దానిలోని పరిమితులు మనలో తిరుగుబాటు తనాన్ని రెచ్చగొడతాయి. అందులోని భయంకర విషయమేమంటే - ఇక్కడ ఎవ్వరి హృదయమూ పగల గొట్టరు - కాని హృదయాలన్ని ముక్కలయి పోతుంటాయి. అలాగే మనసు రాయిలా మారి పోతుంది కూడా. మొండి ముఖంతో - మూతిబిగించుకునే, రోజులు గడపాలి! ఎదురు తిరిగే వాడికి - దయ ఎక్కడ దొరుకుతుంది? నిజానికి - కళలో మాదిరిగానే - జీవితంలో కూడా - ఈ నిరసనస్థితి - అన్ని మానసిక మార్గాల్ని మూసివేస్తుంది- స్వర్గద్వారాలు మూసుకుపోతాయి! కాని ఇక్కడే నేను నేర్చుకోవాలి - ఇదే సరైన మార్గం - ఇక్కనుంచే నా అడుగులు సరైన దారిలో ప్రయాణిస్తాయి - నా చూపు ఆ 'అందమైన ద్వారాలపై నిలిపి' నడవాలి - దారిలో తూలిపడవచ్చు - లేదా పొగమంచులో దారి తప్పవచ్చు -

ఈ 'కొత్త జీవితం' డాంటే అన్నట్లు - ఇది నా కేమి కొత్తకాదు. ఇది పూర్వపు తీరుకు కొనసాగింపే - పరిణామక్రమమే.

ఇపుడు గుర్తుకు వస్తోంది - ఆక్స్‌ఫర్డ్‌లో నా స్నేహితులతో- పక్షులతో నిండివున్న చెట్లక్రింద దారుల్లో నడుస్తున్నపుడు - నేను డిగ్రీ తీసుకునే ముందు సంవత్సరం - అపుడే చెప్పాను: ప్రపంచంలోని అన్ని మధురఫలాలను ఆస్వాదించాలని- ఆ రసహృదయంతోనే నేను ఈ విశాల ప్రపంచంలో అడుగు పెడుతున్నానని. అలాగే బయటకు వచ్చాను. ఆ విధంగా జీవించాను. కాని నా పొరపాటు - నేను వెలుతురులోనే వుండిపోయాను- దీనికి మరో కోణం వుంటుందని తెలుసుకోలేక పోయాను. అవే చీకటి నీడలని, అవే దుఃఖపు ఛాయలని!

ఓటమి, అవమానం, పేదరికం, దుఃఖం, నిరాశ, వేదన, కన్నీరు, బాధతో తెలియజెప్పే తెలివిడి – భంగపాటు, అంతులేని నిస్పృహ, పరితాపపు ముసుగులో ముడుచుకు పోయినట్లు, చేదువిషాన్ని తాగబోతున్నట్లు – ఇవి– ఇవన్నీ నన్ను భయపెట్టినవే. వీటి గురించి తెలుసుకోకూడదని నిర్ణయించు కున్నాను కదా – ఇపుడు ఒక్కొక్కటి రుచి చూడవలసిన పరిస్థితి ఏర్పడింది– నిజానికి– ఇపుడు పూర్తిగా నా ఆహారమే అది అయిపోయింది!

నేను సుఖలాలసతో జీవించినందుకు ఏమాత్రం విచారించటం లేదు. ఆ విషయంలో పూర్తి సంతృప్తితోనే వున్నాను. మనం ఏ పనైనా పూర్తిగానే చేయాలి కదా– నేను అనుభవించని సుఖమే లేదు. నా అంతరంగపు ముత్యాన్ని మధుపాత్రలో ముంచి ఆనందించాను. వేణుగాన మాధుర్యానికి పరిమళాల పూలదారిలో ప్రయాణించాను. సౌఖ్యాల మధుసేవనంలోనే జీవించాను – కాని అదే దారిలో కొనసాగడం పొరపాటవుతుంది. దేనికయినా ఒక పరిమితి వుంటుంది కదా – ఇంక అక్కడి నుంచి కదలాలి – ఈ వెలుగులకు అవతల నా కోసం చీకటి రహస్యాలు దాగివున్నాయి.

నిజానికి ఇవన్నీ చూచాయిగా నా రచనల్లో వున్నాయి. The Happy Prince; The Young King - కొన్నిచోట్ల మతాధికారి తన ముందు వంగిన కుర్రవాడితో 'దేవుడే కదా దుఃఖాన్ని మంచిగా మార్చాడు?' అని రాసినపుడు – అది ఒక వాక్యమే – కాని దీని అంతరార్థం నాకోసం ఇదిగో ఇక్కడ ఎదురు చూస్తుందని అనుకున్నానా? 'Dorian Gray' చిత్రంలోని రక్తపు జీరతో వున్న దారాలు – The Critic As Artist లో ఎన్ని రంగుల్లో వుంది, 'సలోమీ'లో కూడ రాశాను. అదీ తేలికగా అర్థమయ్యే రీతిలోనే 'సలోమీ' (Salome) లో సంగీతాన్ని బంధించి వుంచే తీగల్లా కూడ వినపడుతుంది. 'ఒక్కక్షణం జనించే సుఖం' అను

లోహపు శిల్పం నుంచి – 'శాశ్వతంగా వుండే దుఃఖం' జన్మించటం – ఇలాగే ఇదే– జీవితంలో ప్రతిక్షణంలో జరగబోయే దాని సంకేతం ముందుగానే దర్శనమిస్తుంది.

కళ ఒక చిహ్నమే – మనిషి కూడా ఒక చిహ్నమే, సంకేతమే.

నేను దానిని సాధించవచ్చు–కళాత్మక జీవితం – కళ ఒక చిహ్నమే అయితే – నేను దానిని అందుకోగలను– అదే కళాత్మక జీవితానికి సార్థకత! అంటే నన్నునేను పరిపూర్ణుడుగా చేసుకోవాలి. అవమాన భారం– కళాకారుని అనుభవాల సారమే– ప్రేమ, సౌందర్యానికి ఎలా సంకేతమో– అదే– శరీరాన్ని అంతరంగాన్ని ప్రపంచానికి ప్రదర్శిస్తుంది. Marius The Epicurean లో పీటర్ తన కళాజీవితాన్ని – మతపరంగా అన్వయించుకుని – సాంత్వన పొందుతాడు.

కాని Marius – కేవలం ప్రేక్షకుడు కాదు – అంతకంటే జీవన సంరంభాన్ని భావావేశంతో దర్శించగల ప్రేక్షకుడు – ఇది Wordsworth కవి ఆదర్శాన్ని నిర్వచించిన విధానం! కాని ప్రేక్షకుడు తన పరిసరాలను మరచిపోలేడు– అతను చూసేది – దుఃఖాగ్నిలో పునీతమైన పుణ్యస్థలాన్ని! బాధాతప్త హృదయం సేదదీరే కరుణాలయాన్ని!

★★★

ఇప్పుడే – క్రీస్తు నిజ జీవితానికి – కళాకారుని జీవితానికి ఒక ఆత్మీయకు సంబంధం వుండటాన్ని గమనించాను.

నిజానికి – దుఃఖం నన్ను క్రమ్మివేయక ముందే – నా కాలాన్ని అది కాటువేయక మునుపే – ఈ సంబంధాన్ని The Soul of Man లో– క్రీస్తులాగా జీవితాన్ని గడపగలిగిన వాడు – అతను సంపూర్ణుడని – నా రాతలు – కొండవాలులో గొర్రెలు కాదని – జైలు గదిలో ఖైదీ కాదని – ఒక చిత్రకారునికి ప్రపంచమే కాన్వాసు అని – ఒక కవికి ఈ లోకమే సంగీతమని – చెప్ప గలిగాను.

పారిస్ కేఫేలో కూర్చున్నపుడు – Andre Gide కి చెప్పాను: మెట్టవేదాంతంలో నాకేమీ ఉత్సాహం లేదని – నైతికతలో నిజాయితీలేదని, కాని, ప్లేటో గాని, క్రీస్తుగాని చెప్పింది ఏదయినా కళారూపంగా మార్చవచ్చని – దానికి సంపూర్ణత్వం కలిగించడమేనని.

క్రీస్తు జీవితం చూస్తే మనం తెలుసుకో వచ్చు – ఆయన వ్యక్తిత్వంలోని పరిపక్వత – విశిష్టత – రమణీయత నిజమైన స్పష్టమైన, విశేషమైన, వ్యత్యాసంవున్నా– అదే కళాకారునికి అత్యంత సున్నితమైన సామీప్యంగల సహజ గుణం, అదే తీక్షణమైన అగ్నికణం లాంటి కల్పనా శక్తి వుంటుందని.

మానవ సంబంధాల పరిధిలో ఆయన అర్థం చేసుకున్నది అదే, సృజనా ప్రపంచంలోని విచారణ కళా ప్రపంచంలోని రహస్యమని – కుష్ఠరోగి రోగాన్ని, గుడ్డివాని చీకటిని, కేవలం సుఖాల పరిధిలో జీవించేవాడి దైన్యాన్ని – ధనికుల వింత పేదరికాన్ని – ఆయన పూర్తిగా అర్థంచేసుకున్నాడనే చెప్పాలి.

కష్టంలో వున్నపుడు నాకెవరో రాశారు – నీవు వున్నతంగా లేనపుడు– అది నీవు కాదు! అని – కాని ఈయనికి Mathew Arnold రాసిన 'జీసస్ రహస్యాలు' తెలిసినట్లు లేవు. కాని అతను తెలుసుకోవలసింది – 'ఇంకొకరికి ఏది జరిగిందో – అది మనకీ జరిగినట్లే' నని–

ఏదైనా శాసనం చదవాలనుకుంటే – ఉదయం కాని, రాత్రికాని, సంతోషంగానైనా– విచారంగానైనా– మీ యింటి గోడల మీద రాయండి – సూర్యకిరణాల బంగారుపూతలో మెరుస్తాయి. చంద్రకిరణాల వెండి వెలుగులోనూ కనపడుతుంది. 'ఒకరికి ఏమి జరిగినా – మరొకరికీ జరుగుతుంది' అని!

★★★

నిజానికి క్రీస్తు కవుల సరసన వుండ వలసినవాడు. ఆయన ఆలోచనలోనుంచే కదా మానవజాతి ఉద్భవించి – రూపు దాల్చింది. దేవుని మీద విశ్వాసం గలవాడే – దేవుని నమ్మకానికి పాత్రుడవుతాడు. ఆయనే కదా అన్ని జాతులను ఏకం చేశాడు. క్రీస్తుకు పూర్వం – చిల్లర దేవుళ్లు జనసమూహాలున్నాయి. తన మార్మికమైన కరుణతోనే – సానుభూతితోనే వారికి తనలోనే జన్మనిచ్చి – తనని తాను ఒకని తనయునిగా పిలుచుకున్నాడు. ఇంతవరకు చరిత్రలో అతనే కదా మనలో ఒక అద్భుతమైన తన్యతను నిద్రలేపాడు– అది ఎంత రమణీయమైనది!

నాకు ఇప్పటికీ నమ్మశక్యంకాని సత్యం – ఒక యువ గలీలియన్ కాపరి – ఈ ప్రపంచపు భారాన్నంత తన భుజానికెత్తుకో గలనని ఎలా అనుకున్నాడు? అందరి పాపాలను – అందరి దుఃఖాన్ని – ఇంక ముందు జరగబోయేవి కూడా – నీరో పాపాలు – సీజర్, అలెగ్జాండర్ VI, రోమ్ సామ్రాజ్యాధినేత, సూర్యుని పూజారి, జనసమూహాల వేదనలు – ఇప్పటి వరకు వున్న సమాధులలో మ్రగ్గిన మౌన దుఃఖం; అణగతొక్క బడిని జాతులు – పసివాళ్లు – దొంగలు, జైళ్లలో మ్రగ్గి పోతున్న వాళ్లు – అంటరాని వాళ్లు – (వాళ్ల నిశ్శబ్దవేదన కేవలం దేవుడు మాత్రమే వినగలడేమో?) ఇదంతా ఊహించటమే కాదు – చివరి వరకూ సాధించటం – ఇప్పటి వరకూ ఆయన గురించి తెలిసినవాళ్ళు – ఆయన శిలువకు తలవంచినా – పూజారి ముందు మోకాళ్ళపై వంగి మ్రొక్కినా, తమ తమ వికారమైన పాపాలన్ని నిర్మూలించబడి, దుఃఖపువేదన యొక్క సౌందర్యం అనుభవంలోకి రావడం తెలుసుకుంటున్నారు.

అవును నేను అన్నట్లు – క్రీస్తు కవులతో పాటు వుండవలసివాడే – షెల్లీ – సోఫోకల్స్‌తోపాటు ! అంతేనా – ఆయన జీవితమంతా కవితామయమే కదా – 'జాలికి–భయానికి' గ్రీకు విషాదంతో సరితూగేది ఏముంది? ప్రోటాగనిస్ట్ సంపూర్ణ స్వచ్ఛత – ఈ ప్రణాళికను ఒక

రమణీయకళగా మార్చి వేస్తుంది– టెబీస్, పెలాప్స్ – మరీ దారుణ భీకరత్వాన్ని వదిలి – అరిస్టాటిల్ – ఎంత పొరపాటుగా చెప్పాడో (విషాదంలో ఎవ్వరూ పవిత్రంగా వుండరని) ఎచిలస్‌గాని, డాంటేగాని, (వీరంతా సున్నితత్వంలో గొప్పవారు). షేక్స్‌పియర్ (ఈయన కళాసాహిత్యకారులు అందరిలోకి పరిశుద్ధుడు, నిర్మలుడు) సెల్టిక్ మార్మికతలో – లిజెండ్ (Legend) లో ప్రపంచ సౌందర్యం – కేవలం కన్నీటి ధారలలోనే ఆవిష్కరించిన మానవుల జీవితం కేవలం పూవులాంటిదని – అంత క్షణికమని – బాధతో కూడిన విషాదం కంటే సూక్ష్మమైన ప్రభావాలేమీ వుండదని.

వీటిని, క్రీస్తు తన చివరి పాషన్ (Passion) తో పోల్చవచ్చునేమో – తన పరివారంతో చివరిగా ఆహారం తీసుకున్న సన్నివేశాలను, (అందులో ఒకరు తనను అమ్మేసినవాడు వున్నాడు) ఆ వెన్నెల రాత్రి వనంలోని విషాదం – తన మిత్రద్రోహి – దగ్గరకు వచ్చి ముద్దు పెట్టబోవడం – తనని ఇంకా పూర్తిగా నమ్మిన స్నేహితుడు, మానవునికి విశ్రాంతి గృహాన్ని నిర్మించాలని తపించినవాడు – ఉదయపు కాంతిరేఖలు, పక్షుల అరపులతో ఆగిపోయిన ప్రణాళిక – ఆ తన ఒంటరితనం – తన లొంగుబాటు – అన్నింటినీ అంగీకరించిన ఏకాకి !

ఆహ్వానించిన వానిపై సనాతన పూజారి ఆగ్రహం – అప్పటి పౌరన్యాయాధిపతి – నీళ్లలోసం (తనను తను అమాయకుని రక్తపు మరకల జాడ కడిగేసుకునేందుకు?) అడగటం, ( ఆరక్తపు ఛాయే అతన్ని చరిత్రలో అరుణమూర్తిగా నిలిపింది) ముళ్లకిరీటపు అలంకరణ, ఇటువంటిది చరిత్రలో ఎంతో అరుదైనది కదా –

అమాయకుని శిలువపై శీలలు – అదీ తల్లి సమక్షంలోనే కొట్టి తను ప్రేమించిన శిష్యుని ఎదురుగానే శిలువ వేయడాన్ని, తన దుస్తుల కోసం పందాలు కాస్తున్న సైనికుల ముందు తన దుఃఖసమయంలో




ప్రపంచానికి శాశ్వతమైన చిహ్నాల్ని వదిలి– తరువాత ఒక ఖరీదయిన సమాధిలో – ఈజిప్టు దేశపు గుడ్డలు చుట్టిన దేహం – సుగంధ ద్రవ్యాలతో నిండిన వాసనలతో అతనొక రాజకుమారుని లాగ నిద్రించాడు కదా!

ఇదంతా కళా దృష్టితో సృజనాత్మకమైన ఊహను ఆవిష్కరించి చూడ గలిగితే – ఈ గొప్ప చర్చి ఈ డ్రామా అంతా రక్తపాతం లేకుండా నడిపిన అద్భుతమైన విషాద మార్మిక ప్రదర్శన; సంభాషణలు, ఆహార్యం, సంకేతాలు అన్నింటిలోను తన దేవుని కరుణను, ప్రదర్శించిన తీరు నన్ను ఎప్పుడు ఆశ్చర్య పరుస్తూ ఉంటుంది.

కాని క్రీస్తు జీవితం అంతా విషాదమే – అందులోని కరుణ, దాని అంతరార్థపుటావిష్కరణలోనే సౌందర్యం నిండివుంది. ఇదంతా ప్రార్థనా మందిరాలు మూతపడటంతో – చీకటి నీడలు నేలను క్రమ్మడంతో – అంతమై పోతుంది – ఆ సమాధిగృహానికి రాతిని అడ్డు పెట్టడంతోనూ ఆగిపోతుంది. ఎక్కడో ఆయన చెప్పినట్లు – ఒక పెళ్లి కుమారుడు తన స్నేహితులతో వున్నాడు – తన గొర్రెలతో ఏదో పర్వత సానువుల్లో దారి తప్పుతున్నట్లు చల్లని నీళ్ళ కోసం వెతుకు తున్నట్లు – ఓ పాటగాడు, సంగీత ధ్వనులతో దేవునికి నగరాన్ని నిర్మించాలని తపిస్తున్నట్లు – ఒక ప్రేమికుడు – తన ప్రేమతో ఈ ప్రపంచాన్ని సూక్ష్మంగా చేసినట్లు – ఆయన మాయలన్నీ – చాలా సహజంగా, నీటిసెల లాగనే అన్పిస్తుంది. వీటిని నమ్మడంలో నా కేలాంటి సందేహం లేదు – ఆయన వ్యక్తిత్వంలోని

స్వచ్ఛమైన వెలుగు – బాధతో మూలుగుతున్న జీవులకు శాంతినిస్తుందని, వారికి కేవలం ప్రేమ, ఆనందం గీతాలే వినపడతాయని, (అపోలో వేణునాదంలా) ఆయన సమక్షంలో దుర్మార్గపు ఆలోచనలన్ని అంతర్ధాన మయిపోతాయని నమ్ముతాను.

ఆయన ఆ కొండల్లో మాట్లాడినపుడు విన్నవారికి ఆకలిదప్పులు మాయమయినట్లు – లేదా, అర్థంలేని జీవితాలను చాలించిన సాటి మానవులందరూ సమాధులు వదిలి ఆయన పిలుపు అందుకున్నట్లు – ఆయన మృదుభాషణ వింటూ – తమ ఆహారపు కాఠిన్యాన్ని మరిచి పోయిన ఆయన స్నేహితులు – వారు తాగే నీరు మధువులాగా మారి పోవడం – ఆ భవనమంతా పరిమళాలతో నిండి ఆనందమయంగా విరిసి పోవడం.

★★★



క్రీస్తు గొప్ప గానాన్ని – Renan ఎంత బాగా చెప్పాడు. (5గానాల్లో) ఆయన జీవించి వుండగా ఎంత ప్రేమించబడినాడో – తరువాత కూడా అంతకంటే ఎక్కువగా ఆరాధించబడినాడని. నిజానికి ఆయన కవుల సరసనే వుంటే ఆయన కంటే ప్రేమికుడు ఎవరుంటారు? ప్రేమ ప్రపంచపు రహస్యమని ఆయన దర్శించాడు! ఆ ప్రేమ ద్వారానే – దేవుని పాదాలు చేరవచ్చు – కుష్ఠురోగుని హృదయాన్ని తాకవచ్చు!

అన్నింటికంటే – క్రీస్తు గొప్ప వ్యక్తిత్వం గలవాడు – అవమానాన్ని అంగీకరించటం–ఒక కళాకారుడిగా, అదే గొప్ప ఆవిష్కారం–మూర్తిభావనం. అన్ని రకాల అనుభవాలకు అదే పరిష్కారం.

***ఆయన వెతికేది – మనిషి అంతరంగాన్ని – అదే 'దేవుని సామ్రాజ్య' మన్నాడు. ప్రతి ఒక్కరిలోనూ వుందన్నాడు. అది అతిచిన్న విత్తనంలోనూ – గుప్పెడు మట్టిలోనూ – సముద్రంలోని ముత్యంలోను వుందన్నాడు – ఈ అంతరంగం, అన్ని బాహిర కోర్కెలను వదిలించుకుంటే – (నాగరకత ద్వారా అంటగట్టుకున్నవే) అన్ని భౌతిక స్వాధీనతలనుండి అవి మంచివా చెడ్డవా – అని చూడకుండా – బైటపడాలనే ఆశించాడు.***

★★★

నేను అన్నింటినీ భరించాను. దృఢనిశ్చయంతోనే ఎదిరించి! తిరుగుబాటు మనసుతో – ఈ ప్రపంచంలో నాకంటూ ఏమీ లేకుండా పోయినంత వరకూ – నా కీర్తి పోయింది – నా గౌరవ స్థానం పోయింది. నా సంతోషం పోయింది. నా ధనమంతా కరగిపోయింది – ఇప్పుడు ఖైదులో దిక్కులేని దారిద్ర్యంలో వున్నాను. కాని నా సంతానం వున్నారు – వారిని ఈ చట్టం నాకు దూరం చేసింది. ఎంత దారుణమైన ఘాతమంటే, ఏమి చేయాలో కూడా ఆలోచించలేక పోయాను. ఒక్కసారి నా మోకాళ్ళపై వాలిపోయి – నా శిరస్సు వంచి, దుఃఖించాను – 'పసివాడి శరీరం దేవుని దేహమే, నాకు దేనికీ అర్హతలేదు' అని విలపించాను.

అదిగో ఆ క్షణాలే నన్ను రక్షించాయి. అన్నింటినీ అంగీకరించ గలగటమే నేను చేయగలిగింది – అదిగో అప్పటి నుంచి సంతోషంగా వుండగలుగుతున్నాను – ఇది వింతగానే అన్పించవచ్చు– కాని నిజం యిదే – నా అంతరంగపు లోతులకు చేరగలిగాను. ఇప్పటివరకు నేను దానికి శత్రువుగానే వుండి పోయాను. కాని ఈ క్షణం – నా కోసం స్నేహితునిలాగా ఎదురు చూస్తున్నట్లు అనిపించింది. నీ అంతరంగానికి దగ్గరగా వచ్చినపుడు మనం చిన్న పిల్లలయిపోతామని కదా క్రీస్తు చెప్పాడు.

***చాలా కొద్ది మంది మాత్రమే తమ చివరి క్షణం వరకు తమను తాము తెలుసుకోగలుగుతారు – ఇది విచారించ దగిన విషయమే – ఎమర్సన్ "మనిషి లో అరుదైన విషయం తనను తను తెలుసుకోవటమే!" అన్నాడు. ఇది నిజమే. చాలామంది – 'ఇతరులే' ! వాళ్ళ ఆలోచనలు, ఇతరుల అభిప్రాయాలనే ప్రతిబింబిస్తాయి. వారి జీవితాలు కేవలం అనుకరణే – వారి ఉద్వేగాలు ఇతరుల ఉదాహరణలే!***

క్రీస్తు కేవలం ప్రత్యేక వ్యక్తేకాదు – చరిత్రలోనే మొదట ఉన్నతమైన వ్యక్తిత్వంగల వాడు! కాని అతనిని ఒక లోకోపకారిగా, సర్వసమ్మతమైన వ్యక్తిగా, జ్ఞాన – భావావేశాల పరంగానే జూశారు. కాని ఆయన దీనికి అతీతుడు – ఆయనలో అపారమైన కరుణ వుంది – పేదలపైనా – ధనికులపైనా అంతులేని జాలి వుంది. జైళ్లలో మ్రగ్గేవాళ్లపై – దిగజారిపోయి భగ్నమైన వారిపైనా – కాని ఆయనకు ధనికులపైనే ఎక్కువ కారుణ్యం – జాలి వుంది – వీరే కదా తమ స్వేచ్ఛను వృథాగా గడిపేస్తారు – సుఖసంతోషాలకు బానిసలవుతారు! మెత్తటి వెల్వెట్టు బట్టలు వేసుకుని రాజప్రాసాదాలలో నివసిస్తారు.

పేదరికానికి, బాధకంటే కూడా భౌతిక సుఖాలే నిజమైన విషాదమని నమ్మినవాడు – ఇక సర్వ సమ్మతమైన విషయంలో – స్వసంకల్పం

కంటే మన వ్యాపకమే మనలను నడుపుతుందని కూడా అని ఆయనకు బాగా తెలుసు! మనం ముళ్లపొదల నుండి ద్రాక్షపండ్లు తీయగలమా?

లోకుల కోసం బ్రతకడం – ఆయన వుద్దేశ్యం కాకపోవచ్చు – నీ 'శత్రువులను క్షమించు' అని అన్నపుడు – అది వారి కోసం కాదు – అది నిన్ను నువ్వు రక్షించుకోవటానికే – కేవలం ప్రేమే నిన్ను కాపాడుతుంది – ద్వేషభావం క్షయమే. 'నీకున్నదంతా పేదలకిచ్చేయి' అన్నపుడు – ఈ 'ఉన్నది' నీ అంతరంగాన్ని మబ్బులా కమ్మివేస్తున్నది. ఆయన జీవితాన్ని చూసిన కోణంలో – ఒక కళాకారుడు తనను తాను రక్షించుకొనే వ్యాపకంలోనే పాడతాడు, శిల్పాలు చెక్కుతాడు, చిత్రిస్తాడు – ఈ ప్రపంచాన్ని తన భావదృశ్యాలకు అద్దంలా పడతాడు. వసంతంలో ముళ్లపొదలు పూసినట్లు – జొన్న పొత్తులు బంగారు రంగులోకి మారినట్లు – చందురుడు తన కళలన్ని ప్రదర్శించినట్లు !!

'మీరు ఇతరుల కోసం బ్రతకండి' అని అనలేదు. కాని అందరి జీవితాలు ఒక్కటే అన్నాడు . నీ జీవితానికి, మరొకని జీవితానికి వ్యత్యాసం లేదనే అన్నాడు . దీని మూలంగా, వ్యక్తి జీవితానికి ఒక గొప్ప పరిమాణం ఇవ్వదలిచాడు . క్రీస్తు వచ్చిన తర్వాతనే వ్యక్తి జీవితచరిత్ర ప్రపంచచరిత్రగా మారిపోయింది .

నాగరకత, మనిషి వ్యక్తిత్వాన్ని బరువుగా మార్చింది. కళాకారులకు ఆలోచనలనేకంగా వుంటాయి, పక్షుల గుంపులు మూగినట్లు. అందుకేనేమో వాళ్ళు దూరంగా వెళ్ళి పోతుంటారు . ఇతరుల రొట్టెల్లో ఉప్పెంత వుంది? మెట్లు ఎత్తు ఎంత అని – తెలుసుకోవటానికి తహతహలాడతారు.

గోతే తో పాటు – ప్రశాంతంగా, నిర్మలంగా ఉండాలని అనుకుంటారు.

కాని బోడి లైర్ (Baudelaire)

*O Lord Seigneur, donner moi la force et le courage De contempler mon corps et mon coeur sans degout.*

ఓ లార్డ్ ! నా శరీరాన్ని అసహ్యంతో చూడకుండా వుండే శక్తినివ్వు అని కదా ప్రార్థించాడు?

★★★

కళాకారునికి (సృజనకారునికి) భావప్రకాశం ఒక్కటే జీవితాన్ని ఊహించగలిగిన మార్గం. అతనికి చైతన్యం లేనిదేదీ పనికి రానిదే – మృతప్రాయమే. కాని క్రీస్తుకి అలాకాదు. ఆయన విస్తృతమూ ఆశ్చర్యకరమైన అద్భుతమైన ఊహతో – స్తబ్దమైన ప్రపంచాన్ని, నిశ్శబ్ద విషాద ప్రపంచాన్ని మొత్తాన్ని ఆయన సామ్రాజ్యంగా చేసుకొని, ఆ దుఃఖానికి ఆయనే వాచ్యకారుడయినాడు. ఇంతకు ముందు నేను చెప్పిన అణచివేయబడిన నిర్భాగ్యులు, దేవుడు మాత్రమే వినగలిగిన వారి నిశ్శబ్దం – వీరందరినీ తన సోదరులుగా స్వీకరించాడు.

అంధులకు తానే చూపై వెలిగాడు. బధిరులకు శబ్దమై వినిపించాడు – మూగపోయిన అభాగ్యులకు తానే మాటగా మారాడు. ఈ నిర్భాగ్యులయిన గుంపులకు తానే దారి చూపే నక్షత్రం కావాలనుకున్నాడు. సృజనకారునికి ఒక ఆలోచన – ఒక ఊహ అది చిత్రమో, శిల్పంగానో మారే వరకు ఆలోచనలు కేవలం నిరాధారంగా – ఏ విలువా సంతరించుకోనట్లు, క్రీస్తు – 'విషాద దుఃఖాలకు మూర్తి మంతమై' కళాకారులందరినీ ఆశ్చర్య పరిచి – అధిగమించాడు. అంతవరకు ఏ గ్రీకు దేవుడూ చేయలేని మహత్కార్యమిది.

గ్రీకు దేవతలు – వారి లేత గులాబీ శరీరాకృతులతో కూడా, నిజానికి వారు అలా అనిపించరు – అపోలో కనుబొమ్మ – పర్వతాగ్రం పై చంద్రవంకలా వుంటుంది. అతని పాదాలు ఉదయరాగాలలో రెక్కల

లాగా వుంటాయి. కాని తాను మార్సియస్ (Marsyas) ను కర్కశంగా శిక్షించాడు  నియోబ్ (Niobe) ని సంతానహీనుని చేశాడు! అథెనా (Athena) నిర్దాక్షిణ్యమైన వీక్షణాలలో అరాచిని (Arachne) మీద కారుణ్యమే లేదు – హీరా  (Hera) గొప్పదనం, ఆమె ఆడంబరం – నెమలి ఈకల్లోనే వుండిపోయింది.

ఈ దేవతల తండ్రికి కేవలం మానవ స్త్రీ సంతానం పై దయ, ప్రేమతోనే సరిపోయింది.

ఈ గ్రీకు పురాణ దేవుళ్లలో మతపరంగా భూమాత  డీమీటర్ (Demeter) – కళలకు (Dionysus) –ఈయన  మర్త్యకన్యకు పుట్టి – తన పుట్టుకతోనే తల్లి ప్రాణాలు పోగొట్టిన వాడు.

కాని – (Proserpina)  సిమలి (Semale)  సంతానం కంటే కూడా అద్భుతమైన సృష్టి – ప్రకృతిమాత మట్టి ఒడిలోనుంచి జరిగింది:

నజిరత్‌లోని – వడ్రంగి కొట్టులో నుంచి – ఏ కథా – కల్పనలో కంటే కూడా – అద్భుతమైన వ్యక్తి ఉద్భవించాడు– నమ్మశక్యంకాని విధంగా ప్రపంచానికి, మధువు మార్మికమైన రుచిని, లిలీపూల అందాలను – తెలియ జెప్పాడు– ఇంతకుపూర్వం – ఎవ్వరూ చేయని విధంగా. (Isaiah) ఇజయ 'విషాద మూర్తి, దుఃఖపు లోతులు తెలిసిన వాడు – నిర్లక్ష్యాన్ని – నిందను మోసినవాడు – మనమే – ఆయనను చూడలేక ముఖాలు తిప్పుకుంటున్నాము.' అని కదా అన్నాడు. అపుడే ఆయనలోని దైవత్వం ప్రస్ఫుటమైనది. దీనిని మనం భయంతో చూడకూడదు. ప్రతి కళారూపం ఒక రకంగా ఒక సంభవాన్ని తెలియజేస్తుంది, కాలజ్ఞానంతోనే. ప్రతి మానవుడు చిత్తోద్భూతమైన ఒక ఆవిష్కరణ – దేవునికిగాని – మనిషి ప్రపంచంలోగాని.

క్రీస్తు దీనిని గ్రహించి స్థిరీకరించాడు – Virgilian కవి – స్వప్నాన్ని– అది జెరూసలేమ్‌లో గాని – బాబిలోనులో గాని – తర్వాత శతాబ్దాల సుదీర్ఘ కాలంలో గాని ఈ పరిణామంతో ఆయనలో పునర్జన్మ పొందింది– అందుకోసమే ప్రపంచం వేచి వున్నట్లు. నా దృష్టిలో – చరిత్రలో ఎంతో విచారించ దగినది, క్రీస్తు పునర్వికాస చరిత్ర : Chartres లోని కాథెడ్రిల్ (Cathedral) లో Arthurian కథల్లో – సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిసి, కళలో – డాంటే Divine Comedy లో ఆ పునర్వికాస చరిత్రను నిజాయితీగా చిత్రించలేకపోయాయి. పైగా, Petrarch, రాఫెల్ కుడ్య చిత్రాలలో, Palladian కట్టడాలలో, ఫ్రెంచ్ విషాద గాథల్లో – St. Paul's చర్చిలో, చివరికి Pope's poetry లో కూడా – Classical Renaissance ఛాయలతో ముసుగు వేశారు. చాల కఠినమైన చట్రంలో అనాత్మకంగా ప్రకటించారు–

కాని కళాసాహిత్యాలలో రమణీయకత వున్న సందర్భంలో – క్రీస్తు అంతరంగాన్ని చూడవచ్చు. రోమియో – జూలియట్‌లో, వింటర్ టేల్ (Winter's Tale) లో, Provencal కవిత్వంలో, Ancient Mariner, LA Belle Dame Sans Merci, చాటర్‌టన్ Ballad of Charity - క్రీస్తు పునర్వికాసం చూడవచ్చు.

నిజానికి ఆయనకు మనం ఎంతో ఋణపడివున్నాం – Hugo's - Les Miserables, Baudelaire's - Fleurs Du Mal, రష్యన్ నవలల్లోని – అనుకంప రచన (జాలి) చర్చి భవనాల్లో – రంగు రంగుల అద్దాలు – అద్దకాల వస్త్రాలు – అద్భుతమైన కట్టడాలు అన్ని ఆయనకే చెందుతాయి.

మైకలేంజిలో పాలరాతి కళాకృతులు – చిన్నారుల ప్రేమ, పూలు– ఒకరకంగా ఈ రెంటికీ క్లాసికల్ ఆర్ట్‌లో స్థానం తక్కువే కాని, 12వ శతాబ్దంనుంచి ఇప్పటి వరకూ అక్కడక్కడా కనిపిస్తున్నాయి. కళ,

సాహిత్యాలలో చిన్నారులు, పూవులు అనేక రకాలుగా మనకు దర్శనమిస్తున్నారు.

ఇప్పటివరకూ – చీకటిలో దాగి – వెలుతురులోనే బయల్పడినట్లు – ఒకవేళ పెద్దలు తమను చూసి విసుగు చెందుతారేమోనని భావిస్తున్నట్లు – ఒక్క వసంతంలోనే అలా కనపడి కనుమరుగవుతున్నారు.

★★★

క్రీస్తుకు గల సహజసిద్ధమైన ఊహాశక్తి – అతనిని – ఈ చైతన్యవంతమైన రమణీయకతకు కేంద్రబిందువు చేసింది.

కవితా నాటకాలు – నృత్య రూప నాటకాలలోని వింత పాత్రలు – అవి ఇతరులచే సృష్టించబడినాయి. కాని తన స్వకీయ ఆలోచనలోనుంచే నజరత్ జీసస్ తనను తను సృష్టించుకున్నాడు! చంద్రోదయ వేళలో నైటింగేల్ పాడినట్లే – క్రీస్తు రాక సందర్భంలో ఇజయ ఏడ్పు వినపడటం, ప్రబోధకుని ఆవిర్భావానికి.

ఆయన నెరవేర్చిన ప్రతి కల్పనకూ మరోకోణంలో వికల్పమూ కనపడుతుంది. బేకన్ – ప్రతి సౌందర్యంలోనూ – ఒక వింత కోణం దాగివుంటుంది అంటాడు.

'చైతన్యంతో జన్మించిన వాడు – ఎక్కడ నుంచి వస్తుందో – ఏవైపు పోతుందో తెలియని గాలిలాగా మార్మిక శక్తితో వుంటాడు' అని కదా క్రీస్తు అన్నాడు! అదిగో ఆ విషయంలోనే – ఆయన చిత్రకారులకు, శిల్పులకు ఆసక్తి కలిగించాడు.

మార్మికమూ, అపరిచితమూ, విషాదమూ, ఆనందమూ, ప్రేమ, ఇన్ని సహజ మూలకాలలోనే ఆయన దర్శన మిస్తాడు.

ఆయన ప్రేరణజేసే ఆశ్చర్యకర తన్యతాపూరమైన భావోద్భవంతోనే ఆయనను అర్థం చేసుకోవాలి!

నా వరకు నేను ఆయనను 'ఊహా ప్రపంచపు సారంగానే' గుర్తించటంలో ఆనందిస్తాను. నిజానికి ఈ ప్రపంచంకూడా అదే పదార్థభూతమై వుంది!

నేను Dorian Gray లో రాశాను – ప్రపంచంలోని పాపాలన్నీ బుద్ధిజనితమేనని! కాని నిజానికి 'బుద్ధిలోనే' సర్వకార్యాలు మొదలవుతాయి.

ఇప్పుడు మనకు తెలుసు – మనం కనులతో చూడం – చెవులతో వినం – ఇవన్నీ నిజానికి ఇంద్రియజ్ఞానానికి సమగ్రమో – అసమగ్రమో అయిన వాహకాలేనని!

గులాబి ఎరుపూ, యాపిల్ వాసనా, కోయిల పాట ఇవన్నీ మన మేధ గుర్తింపు లోనే వుంటాయి సుమా!

ఈ మధ్య క్రీస్తు గురించి వ్రాసిన నాలుగు వచన పద్యాలను ఎంతో శ్రద్ధగా చదువుతున్నాను.

మొన్న క్రిస్టమస్ రోజున – ఎలాగో గ్రీకు టెస్ట్‌మెంటు సంపాదించాను. ప్రతి వుదయం– నా జైలుగది నేల తుడిచి – గిన్నెలు కడిగిన తర్వాత, గాస్పెల్స్ ఒక డజను సూక్తులు ఏవైనా తీసి చదువుతాను. ఒక కొత్త రోజు అలా ప్రారంభమవుతుంది. ప్రతి వాడు – ఎటువంటి క్రమశిక్షణ లేని వ్యక్తి అయినాసరే ఈ పనే చేయాలి.

***ఈ ఋతుసంహారపు ఆవృత్త జీవనం – మనలను ఈ స్వచ్ఛంద, నిరాడంబర రమణీయకతకు దూరం చేసింది.***

ఈ గాస్పెల్స్ మనం చాలా తరుచుగా వింటాము. అదీ ఎంతో వికారంగా వింటాము. అందులో ఆధ్యాత్మికత ఏమీ వుండదు.

కాని గ్రీకు గాస్పెల్స్ వినటం మొదలు పెడితే – చీకటి గదిలో నుంచి – లిలీపూల తోటలోకి వచ్చినట్లుంది. క్రీస్తు వుపయోగించిన Iprissima verba మాటలు చదివినపుడు నాకు ఈ ఆనందం రెట్టింపయింది. క్రీస్తు ఎప్పుడూ Aramaic లోనే మాట్లాడాడని అంటారు. రినాన్ (Renan) కూడా అదే అనుకున్నాడు.

ఆరు వారాల క్రితం – వైద్యుని సలహా మేరకు రోజూ ఇచ్చే నల్లని మోటు రొట్టి బదులు – White Bread ఇచ్చారు. అది చాలా రుచిగా వుంది. నిజానికి ఎండి పోయిన రొట్టి రుచిగా వుందంటే – అది వింతగానే ధ్వనిస్తుంది. నాకు మాత్రం – ప్రతి భోజన సమయంలో – చిన్న చిన్న రొట్టి ముక్కలు కూడా నా తెల్ల సత్తు పళ్ళెంలో వదలకుండా తింటాను. అంతే కాదు – బల్ల తుడవటానికి పరచిన ముతక గుడ్డమీద పడిన చిన్న ముక్కలు కూడా వదిలిపెట్టను – ఇదంతా ఆకలితో కాదు సుమా – కాని నాకు ఆహారం సరిపడా అందుతోంది – అయినా ఏదీ వృథా పరచకూడదు – నాకు అందినదేదీ చేజారనీయకూడదు– అలాగే ప్రేమ, అనురాగ విషయంలో కూడా – పూర్తిగా అందుకోవాలి – ఎవ్వరైనా!

సెయింట్ మార్క్ గ్రీకు స్త్రీ గురించి చెప్పిన కథ కూడా నచ్చింది.

ఆమె నమ్మకాన్ని పరీక్షించాలని – ఇజ్రాయిల్ చిన్నారులకు చెందిన ఆహారాన్ని ఇవ్వనని అన్నపుడు – ఆమె – అదిగో బల్లక్రింద 'చిన్న కుక్క'పిల్లలు తింటున్నాయి – ఆ రొట్టె ముక్కలు చాలు – అవి ఆ చిన్నారులు వదిలి వేసినవే కదా అంటుంది!

ఎక్కువ మంది ప్రేమకోసం, మెప్పుకోసం బ్రతుకుతారు. కాని మనం – ప్రేమలో, ఆశ్చర్యంలో బ్రతకాలి.

***మన మీద ఎవరైనా ప్రేమ చూపారంటే దానికి మనకు అర్హత లేదనే అనుకోవాలి. ఎవరికీ ప్రేమించబడే అర్హత లేదు.*** దేవుడు మానవుణ్ణి ప్రేమిస్తున్నాడంటే – ఆయన ఆద్యంతరహితమైన ప్రేమను – నిరంతర అయోగ్యుడైన మనిషి పై వర్షిస్తున్నట్లే – ఇది వినటానికి కఠినంగా వుంటుంది. పోనీ ఇలా అనుకుందాం – అందరికీ ప్రేమకు అర్హతవుంది – అలా అనుకునే వాడికిదక్క!

ప్రేమ – ఒక దివ్య ప్రసాదం, జ్ఞానానుపానం! దానిని మోకాళ్ళ పై వంగి స్వీకరించాలి! DOMINE, NON SUM DIGNUS అని ఉచ్ఛరిస్తూ – మనసును నింపుకోవాలి.

★★★

మళ్ళీ నేను రచన సాగిస్తే – అదే కళాత్మకమైన సృజనను చేయగలిగితే – రెండు విషయాల ద్వారానే నన్ను నేను తెలియ పరుచుకోవాలి –

**ఒకటి – క్రీస్తు : మానవ జీవితంలోని రమణీయ సంవేదనకు మూల పురుషుడని –**

**రెండోది – కళాకారుని సృజనకు వ్యక్తిత్వానికి గల సంబంధం గురించి!**

మొదటిది ఎంతో మనోహరమైనది. నాకు క్రీస్తు వ్యక్తిత్వంలో సర్వసంపూర్ణమైన గుణాలన్నీ ప్రోది చేసి వున్నట్లు కనపడతాయి.

ఆయనే కదా – 'పువ్వుల్లా' జీవించండి అని అన్నాడు! 'Flower like lives' అనే పద బంధాన్ని నిర్మించాడు! చిన్నారులను ఆదర్శంగా తమను తాము మార్చుకోమని అన్నాడు – వారినే పెద్దలకు మార్గదర్శకులుగా చూపాడు !

చిన్నారులను గూర్చి నేనుకూడా ఎంతో ఆలోచించాను – వారి ముఖ్య ఉపయోగం ఏమిటా అని – పరిపక్వమైనది – ఉపయోగకరంగా వుండాలి కదా !

డాంటే – మనిషిని, దేవుని చేతినుంచి – 'ఏడుస్తూ నవ్వుతూ వస్తున్న చిన్నారు'నిగా వర్ణించాడు.

క్రీస్తు కూడా ప్రతివానిని –

A GUISA DI FANCIULLA CHE PIANGENDO ERIDENDO PARGO LEGGIA (A little girl weeping and now laughing)

***జీవితం మారుతూ వుండాలి – ఝరిలాగా ప్రవహిస్తూ వుండాలి. చైతన్యంతో వెలిగిపోతుండాలి. ఒక మూసలో బిగిసిపోవటం మరణించటంలాంటిదే ! వస్తు ప్రపంచం మీద అనురక్తి పెంచుకోకూడదు – సాధారణ జీవితం మీద మోజు పనికి రాదు.***

***అనిర్దుష్టమైన గమనంలో గొప్ప సాహసం వుంటుంది. సామాన్య వ్యవహారాల పై ఎక్కువ సమయం వెచ్చించ కూడదు – పక్షులు అలా చేయవు కదా!***

***రేపటి గురించి ఆలోచించకు – తోలుతిత్తి కంటే ఆత్మ గొప్పది – నీవు కప్పుకున్న వస్త్రం కంటే నీ శరీరం గొప్పది కాదా, అని కదా అడిగాడు!***

ఒక గ్రీకు మాత్రమే ఇలా చెప్పగలడు – ఇది గ్రీకు ఆలోచనతో నిండి వుంది. క్రీస్తు – జీవితాన్ని నిర్దుష్టంగా నిర్వచించాడు. ఆయన నైతికత కేవలం కరుణపూరితమే, దయాగుణమే. అదే నైతిక భావన!

'ఆమె పాపాలన్ని క్షమించబడినాయి – ఆమె ప్రేమించింది కాబట్టి' – ఎంత గొప్పవాక్యం!

ఆయన ధార్మికత కవితాత్మకం – అదే అసలు ధర్మం! బిచ్చగాడు స్వర్గానికి వెళ్ళాడు – అతడు కష్టాలలో వున్నాడు కాబట్టి! అంతకంటే ఏమి హేతువు కావాలి, స్వర్గారోహణకు?

ద్రాక్షతోటలో సాయంత్రం ఒక గంట పని చేసిన వారికి – రోజంతా ఎండలో మ్రగ్గిన వారితో సమానంగానే ముట్ట చెప్పుతారు. అలా ఎందుకు ఇవ్వకూడదు?

అసలు ఎవ్వరికీ దేనికీ అర్హత లేదు – లేక వారు భిన్నమైన వ్యక్తులేమో–

కాని క్రీస్తుకి – మనుష్యుల్ని యంత్రాలలాగా చూసే వ్యవస్థ మీద ఏమీ ఆసక్తి లేదు. అందరినీ సమాన ప్రతిపత్తితో సమాన దృక్పథంతో చూడాలన్నాడు. దీనికి ఏ చట్టమూ పనికిరాదు. కేవలం కొన్ని మినహాయింపులే – ***ఎవరైనా ఏదైనా – ప్రపంచంలో ఏది ఏమైనా సరే.***

అసలు రమణీయ కళాప్రపంచానికి ఏది ముఖ్యమైనదో ఆయనకు అదే సహజమైన జీవనానికి ఆధారం ! అంతకంటే భిన్నమైన మూలాన్ని చూడలేదు.

ఆయన ముందుకు, మరో ఆధారాన్ని – అదీ పాపకర్మలో పట్టుపడిన స్త్రీని తీసుకువచ్చినపుడు – ఆమె శిక్షా వాక్యాన్ని చూసినపుడు –

తన వేలితో నేలమీద రాశాడు – 'మీలో పాపం చేయని వాడే మొదటి రాయి విసరండి' అని ! అంతకంటే జీవితానికి సాఫల్యం ఏమికావాలి?

ఆయన అమాయకుల్ని ప్రేమించాడు. బహుశా ఆయనకు తెలుసునేమో – అమాయకుల హృదయ మూలాల్లో గొప్ప ఆలోచనలుంటాయని !

అలాగే మూర్ఖులను భరించేవాడు కాదు – ముఖ్యంగా చదువుకున్న మూర్ఖులను! అభిప్రాయాల సంకటంలో కూరుకుపోయి – వాటి అర్థంకూడా తెలుసుకోలేని ఆధునికుల సమూహాలను ప్రత్యేకించి దూరంగా వుంచాడు. వీరందరికీ జ్ఞానం వుంది – అది వారికీ పనికిరాదు, ఎదుటివారికీ పనికిరాదు – కాని ఆ జ్ఞానమే దేవుని దగ్గరకు చేరటానికి ఉపయోగపడుతుంది.

ఆయన పోరాటమంతా శత్రువుల (ఫిలిస్టయినల) తోనే; వెలుగులో వున్న ప్రతివాడు పోరాడ వలసిన యుద్ధమే అది!

ఆ పగవాళ్ళతోనే – వారి సమాజంలోనే ఆయన బ్రతికాడు. వారి మూర్ఖత్వంతో – వారి అగౌరవ మత ఛాందస ప్రవృత్తిలో, అసహ్యకరమైన భౌతిక సుఖలాలస జీవితాలతో – వారి అహంకార ప్రవృత్తితోనే పోరాడాడు – అప్పటి జెరూసలేం యూదులు – సరిగ్గా ఇప్పటి మన 'బ్రిటిష్ ఫిలిస్టన్' లాంటివారే.

క్రీస్తు 'Whited Sepulchre'ని నిరసించాడు. ఆ పదాన్ని శాశ్వతంగా నిర్మించాడు !

*ప్రాపంచిక కార్యసిద్ధిని పనికిమాలిన ఫలితంగా చూశాడు. సంపదను మనిషిని కబళించే అనవసర విషయంగా పరిగణించాడు – దానిని మోయలేని బరువుగా గుర్తించాడు–*

*జీవితాన్ని ఏ ఒక్క సిద్ధాంతానికో, నైతిక చట్రంలోనో బంధించి నాశనం చేయకూడదంటాడు. కార్యాలు, క్రతువులు మనిషి కోసమని – మనిషి వాటి కోసం కాదని అంటాడు. పరోపకారులు, డాంబికమైన ధార్మిక సంస్థలు మధ్యతరగతి మనుషులను ఎంతగా ప్రలోభపెట్టి ప్రభావితం చేస్తాయో తెలియచెప్పి, తిప్పి కొట్టాడు.*



ఆస్కార్ వైల్డ్ నివాస గృహం

వాళ్ళు సదాచారమని దేనిని అంటారో, అది కేవలం అతిసులభమైన తెలివితక్కువ అంగీకారమే – కాని వారి చేతిలోనే అంతులేని అధికారం చిక్కుకుని వుంటుంది– జాగ్రత్త! అన్నాడు ! ఇవన్నీ ప్రక్కలకు తోసి వేశాడు.

కేవలం ఆధ్యాత్మికతే ప్రమాణమన్నాడు. మీరు – చట్టాన్ని – బోధనల్ని చదువుతున్నారు అని ఎత్తిచూపాడు. కాని వాటి కనీసార్థం తెలిసికాదన్నాడు. రోజువారీ ఆవృత్తంలో జీవించడంలోని లేకితనాన్ని ఎండకట్టాడు. ప్రతిక్షణం అర్థవంతంగా బ్రతకటంలోని ఆనందాన్ని బోధించాడు!

★★★

పాపకర్మల నుండి ఆయన రక్షించిన వాళ్ళందర్నీ కూడ కేవలం వారి జీవితాలలోని మధుర క్షణాలకోసమే రక్షించాడనిపిస్తుంది.

క్రీస్తును చూడగానే మేరీ మగ్దలీనా (Mary Magdalen), ఆమె ప్రియులలో ఒకరిచ్చిన అత్యంత ఖరీదైన పింగాణీ పూల కలశాన్ని పగలకొట్టి అందులోని సుగంధద్రవ్యాలను ధూళిధూసరితమైన ఆయన పాదాలపై ఒలికించింది. అదుగో ఆ క్షణం కారణంగానే ఆమె రూత్, బియాట్రిస్‌తోను కలిసి మంచుపూల స్వర్గసీమలో సంచరిస్తోంది.

క్రీస్తు మనకు తెలియజెప్పేది, హెచ్చరించేది– జీవితంలో ప్రతిక్షణం అందంగా ఉండాలని– అంతరంగం రాబోయే పెళ్లికొడుకు, అతని ప్రియమైన పిలుపుకోసం వేచివుండాలని.

ఫిలిస్టీనిజమ్, దీనికి వ్యతిరేకం: ఊహాజనిత చైతన్యం గురించి ఏమాత్రం అవగాహన లేనిది.

ప్రేమ ప్రభావంతోనే జీవితంలో వెలుగులు నిండుతాయని, కల్పనా శక్తి మాత్రమే ప్రపంచాన్ని ప్రకాశింప జేస్తుందని దర్శించాడు. ఈ భావనాశక్తే ప్రేమస్వరూపం, దీని సారూప్యతలోని వ్యత్యాసమే మనిషికి మరొకనికి గల భేదం. ఇదే ప్రపంచం అర్థం చేసుకోవలసిన సత్యం.

పాపిని దరిజేర్చినపుడే క్రీస్తు చాల కమనీయంగా సత్యానికి దగ్గరగా కనిపిస్తాడు. ప్రపంచం సాధువులు, సత్పురుషుల ద్వారానే దైవసన్నిధిని త్వరగా చేరగలదని భావిస్తుంది. క్రీస్తు తన సహజ దైవగుణంతో, పాపకర్మలే మనిషిని సంపూర్ణుడిగా చేస్తాయని నమ్మినట్లు కనపడుతుంది.

ఆయన ప్రాథమిక కోరిక జనుల గుణదోషాలను సరిచేయటం కాదు. కాని వారి దుఃఖాన్ని నివృత్తి చేయటమే. కరుడు కట్టిన దొంగను గుణవంతునిగా సంస్కరించటం ఆయన లక్ష్యం కాదు. ఒక సామాన్యున్ని సాధువుగా మార్చటంలో గొప్పగా సాధించేదేమీలేదని నమ్మాడు. ఆయనకు 'ఖైదీల సేవాకేంద్రం' గురించి తెలిసే అవకాశం లేదుకదా. ఇంకా ఈ ప్రపంచానికి అవగాహనకు రానిది 'పాపకర్మ – బాధలే' మానవుని సంపూర్ణతకు ఎంతో పవిత్రమైన, రమణీయమైన దారులని తెలుసుకోవటమే.

ఇది చాలా ప్రమాదకరమైన అభిప్రాయమే– అవును అన్ని గొప్ప ఆలోచనలూ ప్రమాదకరమైనవే. కానీ నిస్సందేహంగా క్రీస్తు మతమే ఇది. నేను కూడా ఇది పూర్తిగా నమ్ముతాను. అవును పాపాత్ముడు

పశ్చాత్తాప పడాలి. ఎందుకు? లేకపోతే తాను చేసిన తప్పు అతనికి తెలియవచ్చేదేలా? పశ్చాత్తాపం మొదలైన క్షణాలే ప్రథమ శిక్ష, అంతే కాదు దాని ద్వారానే అతని గతాన్ని మార్చుకోవచ్చు.

గ్రీకులు ఇది సమ్మతించరు. వారు తరచు 'దేవుడు కూడ గతాన్ని మార్చలేడు' అని Gnomic aphorism లో గట్టిగానే చెప్పారు.

క్రీస్తు సామాన్యుడు కూడా ఆ పని చేయగలడని నిరూపించాడు. ఆ పని తాను చేయగలనన్నాడు. ఏ విధంగా అని అడిగితే ఇలా సమాధానం చెప్పి ఉండేవాడు– 'ఈ విషయంలో నాకెలాంటి సందేహం లేదు–

'దుర్నీతిపరుడు తన మోకాళ్లపై వంగి దుఃఖిస్తున్నప్పుడే – తన జీవితంలోని విలువైన కాలాన్ని బజారు స్త్రీలతో, అడ్డమైన గడ్డితినే పందుల గుంపులతో వృథా పుచ్చినట్లు గుర్తించగలడు.'

ఎవరైనా సరే జైలు జీవితాన్ని అనుభవించినప్పుడే ఇది ఎరుకలోకి వస్తుందని చెప్పటానికి సాహసిస్తున్నాను. ఆ విధంగా తెలుసుకో గలిగినప్పుడు జైలుకు వెళ్ళడంలో కూడా తప్పు లేదు.

క్రీస్తులో ఒక ప్రత్యేకత ఉంది –

ఉషోదయం ముందుగా కొన్ని వెలుగులు కనపడినట్లు, శీతాకాలంలోని ఎండ క్రోకస్ పూలను బంగారు రంగులోకి ముందుగానే మారుస్తుంది. సమయానికి ముందే ఏదో పక్షి తన జంటను పిలుస్తుంది. ఇదే విధంగా –

క్రీస్తు కంటే ముందు క్రిస్టియన్లు ఉన్నారు. దీనికి మనం కృతజ్ఞత తెలుపవలసిందే, కాని దురదృష్టం ఏమిటంటే క్రీస్తు తరువాత మరొకరెవరూ లేకపోవడం.

దీనికి ఒకే ఒక మినహాయింపు St. Francis of Assissi- దేవుడు ఆయనకు పుట్టుకతోనే కవి హృదయాన్నిచ్చాడు. తరవాత ఆయన

పేదరికాన్ని పెళ్ళాడాడు. కవితాత్మతో, భిక్షగాని శరీరంతో పరిపూర్ణతకు మార్గం సులభమైంది. ఆయన క్రీస్తును పూర్తిగా అర్థం చేసుకున్నాడు. అందుకే ఆయనలాగానే మారగలిగాడు.

మనకు ఈ విషయాన్ని బోధించటానికి Liber Conformitatum అవసరం లేదు.

St. Francis జీవితం– IMITATIO CHRISTI ఈ పేరుతో ఉన్న పుస్తకంలో వచన కవిత్వంలో అదే చెప్తోంది.

క్రీస్తు ఎంతో మనోహరమైనవ వాడు. క్రీస్తు వ్యక్తిత్వంలో ఎంతో రమ్యత ఉంది.

ఆయన ఒక కళాకృతి. ఒక చూడామణి. ఎవరికీ ఏమీ బోధించడు. కాని ఒకసారి ఆయన సన్నిధిలోకి వస్తే మనలో ఏదో మార్పు సంభవిస్తుంది. ప్రతి వ్యక్తి ఎదో ఒకనాడు ఈ సంఘటనకు సిద్ధమై ఉంటాడు. తన జీవితంలో కనీసం ఒక్కసారైనా క్రీస్తుతో కలిసి Emmaus వరకు నడుస్తాడు.

★★★

**ఇక రెండో విషయం:** కళాకారునికి, సృజనకారునికి అతని బ్రతుకు నడతకు ఉండవలసిన సంబంధం.

మీకు ఆశ్చర్యంగా ఉండవచ్చు ఈ విషయాన్ని నేను ప్రస్తావిస్తున్నందుకు.

ప్రజలు 'రీడింగ్ గోయల్' జైలు వైపు చూపి "అదుగో అక్కడికే ఒక కళాకారుని జీవితం తీసుకువెళ్లేది..." అని అంటారు. కాని అంతకంటే ఇంకా నికృష్టమైన చోటుకు కూడ నడిపించవచ్చు.

జీవితాన్ని యాంత్రికంగా గడిపే వారికి వారి బాట ఏదో గమ్యమేమిటో స్పష్టంగా ఉండవచ్చు. దానికి కావలసిన ప్రణాళికతో

వనరుల లభ్యతను బట్టి వారు అక్కడికే చేరతారు కూడ. వారు సదాలోచనతోనే పురోహితునిగా మారాలని ప్రయాణం మొదలు పెడతారు. ఎటువంటి జీవన వృత్తిలో ఉన్నా చివరకు మొదలు పెట్టిన ఆలోచన ప్రకారమే రూపొందుతారు.

పార్లమెంటు సభ్యులవ్వాలని, గొప్ప వ్యాపారి కావాలని, న్యాయవాదిగా పేరుగాంచాలని, న్యాయాధిపతిగా ఎదగాలని, ఇలా కోరికను కష్టపడి సాధించేవారు తప్పనిసరిగా ఫలితాన్ని పొందుతారు. ఇదే వారికి శిక్ష. ఏ ముసుగు వేసుకోవాలను కుంటారో దానినే ధరించాలి– ముఖానికి కప్పుకోవాలి.

కాని జీవన వైరుధ్యంలోని శక్తులతో నిండినవాడు – వీని జీవితం వేరుగా ఉంటుంది. తన్ను తాను తెలుసుకోవాలని తపించేవాడు తాను ఎక్కడకు వెళుతున్నాడో తెలుసుకోలేక పోవచ్చు. వారికి తెలియదు కదా, *గ్రీకు భవిష్యవాణి* చెప్పినట్లు ఒక విధంగా 'నిన్ను నువ్వు తెలుసుకో' అనేది ఎంతో అవసరమైనది. జ్ఞాన తృష్ణకు ఇదే పరాకాష్ఠ. కాని దీనిని గుర్తించటం – అదే మనిషి అంతరంగపు లోతులు తెలుసుకోవటం – అసాధ్యమనే ఎరుక, అదే 'తెలివి' గలగటం! చిట్టచివరి రహస్యం– అది నీవే, నీ మనసే.

***నీవు, సూర్యుణ్ణి తులామానంలో పెట్టి బరువు తెలుసుకున్న తరువాత, చంద్రుణ్ణి చేరే మెట్లన్నీ కొలిచిన తరువాత, నక్షత్రవీథిలో సప్తలోకాలకావలి స్వర్గాన్ని చేరిన తరువాత కూడా ఇంకా మిగిలింది 'నీవే' సుమా!***

నీ అంతరంగం తిరిగే కక్ష్యను తెలుసుకొని కొలిచేదెలా?

***నీ కొడుకు నీ చిదుగుల కోసం మరుభూమికి వెళ్లినప్పుడు అతనికి తెలియదు, అప్పటికే ఒక దేవదూత తన తండ్రికి సంస్కార తైల మర్దన చేయిస్తున్నాడని – తన తండ్రి ఆత్మ పరమాత్మలో లీనమైపోయిందని.***

'ఇదిగో ఇక్కడికే నా కళా జీవితం నన్ను తీసుకు వచ్చింది' అని గర్వంగా చెప్పగల వ్యక్తిత్వం గల వానిగా, ఒక అద్భుత సృష్టి చేయగలనని ఆశిస్తున్నాను.

ఈ విషయంలో ఇద్దరి జీవితాలను అవలోకిస్తే –

మొదటిది Verlaine; రెండోది Kropotkin రాకుమారుడు.

వీరిద్దరు చాలా సంవత్సరాలు జైలు జీవితం గడిపారు. Verlaine క్రిస్టియన్ కవి, డాంటే తరువాతి వాడు. Kropotkin రాకుమారుడు క్రీస్తు ఆత్మతోనే రష్యా నుంచి వచ్చినట్లున్నాడు.

గత ఏడెనిమిది నెలలుగా ఎన్నో కష్టాల పరంపరలకు నేను లోనవుతున్నా బయటి ప్రపంచం నుంచి నా మీద నిరంతరం నిందలు వచ్చి పడుతున్నా, ఇక్కడ నేను లోనయిన మానసిక, శారీరక శ్రమ నన్ను మాటలే లేకుండా చేసిన సందర్భంగా మొదటి సంవత్సరమంతా ఈ చెరలో పడి నా బలహీనమైన చేతులు తిప్పుకుంటూ 'అరే! ఎటువంటి ముగింపు, ఎలాంటి ముగింపు' అని వాపోయా.

కాని ఇప్పుడు నరకయాతన అనుభవిస్తూ కూడ 'ఎలాంటి ఆరంభం, ఎంత అద్భుతమైన ప్రారంభం' అని ఆశ్చర్యపోతుంటాను. ఇది ఇలాగే ఉంటుందేమో. అలాగే అయితే ప్రతి వ్యక్తిని సరిదిద్దగల స్థలం ఇదే అని అంగీకరించాలి.

పోయిన మే నెలలో నేను ముందుగా అనుకున్నట్లు విడుదలై ఉంటే బయటకు వచ్చి ఇక్కడి చేదు అనుభవాలతో ఈ కారాగారాన్ని అసహ్యంతోనే చూసేవాడిని. అది నాకెంతో కీడు చేసి ఉండేది. కాని నా శిక్ష మరొక సంవత్సరం పొడిగించ బడింది. నాతో పాటు ఈ చెరలో మానవత్వం కూడ ఉంది.

ఇప్పుడు నా విడుదల తరువాత ఇక్కడ నాకు లభించిన దయా దాక్షిణ్యాలకు కారకులయిన అందరినీ కృతజ్ఞతతో గుర్తుంచుకుంటాను. అంతేకాదు నా విడుదల రోజున వీరందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలిపి వారి జ్ఞాపకాలతోనే బయటి ప్రపంచంలో అడుగు పెడతాను.

ఈ జైలు తీరుతెన్నులు పూర్తిగా లోపభూయిష్టం. నేను బయటకు వచ్చిన తరువాత దీనిని మార్చటానికి నేను ఏమైనా సరే చేస్తాను. ఆ ప్రయత్నం చేయాలనే అనుకుంటున్నాను. కాని ఒక్క విషయం ప్రపంచంలో మనిషి చైతన్యాన్ని, అంతరంగాన్ని, ఆత్మను, క్రీస్తు దయారసాన్ని (ఈయన చర్చిల్లో లేడు) ప్రేమ తత్వాన్ని ఏ శక్తి ధ్వంస పరచలేదు. కనీసం సన్మార్గంలో పెట్టలేకపోయినా విధ్వంస పరచలేదు.

★★★



**బ**యట ప్రపంచంలో నాకోసం ఎదురు చూసేవి చాలానే ఉన్నాయి. St. Francis of Assissi అన్నట్లు "నా సోదరుడు వాయువు, నా సోదరి వర్షం" ఎంత అద్భుతం ఈ రెండూ!

ఇంకా సూర్యాస్తమయాలు, అద్దాల కిటికీలు, గొప్ప నగరాల వ్యాపార భవనాలు ఇలా చెప్పుకుంటూ పోతే ఈ చిట్టా ఎక్కడాగుతుంది? ఈ ప్రపంచం అందరితోపాటు నా కోసం కూడ ఉంది కదా.

ఇప్పటి వరకు లేనటువంటి ఒక విశేషంతో బయటకు వస్తున్నాను.

***నీకు తెలుసు - నైతిక విలువల సంస్కరణను నేను ఎంతగా నిరసిస్తానో, మత సంబంధమైన సంస్కరణలను కూడ అంతగా ఖండిస్తాను. శాస్త్ర పరంగా కాకుండా మరో విధంగా మనిషి లోతును పెంపొందించ గలిగింది ఒక్క వేదన మాత్రమే. అదే నా అనుభవంలోకి వచ్చింది.***

నా విడుదల తరువాత నా మిత్రుడెవరైనా నన్ను విందుకు ఆహ్వానించకపోతే నేను అస్సలు లెఖ్క చెయ్యను. నా సంతోషానికి అలాంటి అడ్డంకులేమీ ఉండవు.



***స్వేచ్ఛతో, పూలగుత్తులతో, వెన్నెల వెలుగుతో ఎవరు సంతోషంగా ఉండరు?***

అంతే కాదు ఇప్పుడు ఈ విందులు వినోదాలతో నాకు పనిలేదు. అదృష్టవశాత్తు నా జీవితంలో ఆ పార్శ్వానికి ఇక ఆస్కారం లేదు అని చెప్పగలను. కాని నా స్నేహితుడెవరైనా కష్టంలో ఉండి, ఆ కష్టాన్ని నాతో పంచుకోడానికి ఇష్టపడకపోతే చాల బాధపడతాను. ఇంతకంటే ఎక్కువ అవమానం మరొకటి ఉండదని విచారిస్తాను. నిజానికి నాకు అతని బాధను పంచుకొనే హక్కుందని అనుకుంటాను.

***ఈ ప్రపంచపు సౌందర్యాన్ని చూడగలిగిన వాడు అందులోని దుఃఖాన్ని కూడా దర్శించగలగాలి. ఆ రెండింటిలోని అద్భుతాలను తెలుసుకోగలగాలి. అందులోనే దైవాంశను స్పృశించగల అవకాశం, దేవుని రహస్యాలకు దగ్గరగా రావటానికి వీలూ ఉంటుంది.***

నా జీవితంలోకి, నా సృజనలోకి మరింత గంభీరమైన మోహావేశపు ఉద్ధతి, ఉత్సాహమూ సంయోగం చెంది ఆవిష్కరించబడవచ్చు– పరిమాణం కంటే ఉద్వేగం, ఆధునికత, కళకు ముఖ్యోద్దేశ్యం; మనం గుణాత్మకమైన కళలో లేము – దీని నుంచి మినహాయింపు మన ప్రయత్నం కావాలి.

ఇప్పటివరకూ నేను పడిన వేదనను ఏ రూపంలోనూ, మూర్తిమంతంగా ఆవిష్కరించలేను. ఈ విషయం నేను ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు. *అనుకరణ అంతమైన దగ్గర్నుంచే నిజమైన కళ ఆవిర్భవిస్తుంది.* ఒక ప్రత్యేక సంపూర్ణత నా సృష్టిలో, సృజనలో, పదాల అర్థాలు, స్వరమూర్ఛనలతో నిండుగావుండాలని ఆశిస్తాను. మరింత లోతైన అన్వేషణ ప్రభావంతో, తేలికైన నిర్మాణ పద్ధతితో పాటు కమనీయసుందరంగా కూడా రూపుదిద్దుకోవాలి.

Marsyas was 'torn from the scrabbard  of his limbs' Della Vagina Della Membre Sue - ఇది కదా డాంటే చెప్పిన ఘోరమైన Tacitean వాక్యం. ఆ తరువాత ఇంక చెప్పటానికి ఏమీలేదు.

గ్రీకులన్నారు, అపోలో విజేత అని! తంత్రీవాదనే నిలకడలేని రెల్లుని జయించింది  (The Lyre vanquished the reed) కాని గ్రీకులు పొరపడ్డారేమో?

ఆధునిక కళాసృష్టిలో – Marsyas దుఃఖపు రోదనలు విన్పడుతూనే వున్నాయి. ఇదే Baudelaire రచనల్లో చేదుగా వుంటుంది. Larmartine అయితే తియ్యగా తిన్నగా వుంటుంది. Verlaine మార్మికంగా చెప్తాడు. Chopin సంగీతంలో ఈ మూర్ఛనలు మారిపోతుంటాయి. Burne-Jones స్త్రీలయితే అసంతృప్తితో అల్లాడి పోతుంటారు.

Mathew Arnold, Callicles పాటల్లో, కవితలో, తీయని తంత్రీవాదన విజయాన్నే వినిపిస్తుంది. అద్భుతమైన అంతిమ విజయాన్ని వినిపిస్తుంది–అది కూడా సంగీత సౌందర్యంతో! అందులో అంతర్లీనంగా వున్న వేదనఛాయలు, వ్యాకులపాటును సందేహాస్పదంగానే వినిపిస్తుంది.

Thyrsis బాధను తెలియజేయటానికి, Scholar Gipsy వేదనను వినిపించడానికి, ఆర్నాల్డ్‌కి – గోతే గాని, వర్డ్స్‌వర్త్‌గాని సహాయం చేయలేక పోయారు–సన్నాయి పీకతోనే– మూర్ఛనలన్నీ వినిపించాడు!! Phry Gian Faun  మౌనంగా వున్నాగాని నేను వుండలేను. అదిగో ఆ జైలుగోడ పైగా కనబడుతున్న కొమ్మలకు పూలుపూసేముందు, చిగురుటాకులు గాలికి అల్లాడుతున్నట్లు – ఆ విధంగా నేను నా బాధను వెళ్ళగ్రక్కుకోవాలి.

ఇప్పుడు నా సృజనకు–ప్రపంచానికి చాలా పెద్ద అగాధం ఏర్పడింది! కాని నా కళకు నాకూ మధ్య అటువంటిదేమీలేదు. అలా అనే నేను ఆశిస్తాను.

మనందరికీ ఎవరి అదృష్టం వారికి విడిగా వుంటుంది – లేదా మన అదృష్ట దురదృష్టాలను ఎవరికి వారు కలుస్తుంటాము! నా విషయంలో అది అవమాన భారంతో నిండి అపఖ్యాతిని తెచ్చింది. దీర్ఘమైన కారాగారవాసంతో కష్టాలు, కడగండ్లు, దురవస్థ, అవమానం, వీటన్నిటిని అనుభవించాను. ఇది నాకు తగినది కాదు. కనీసం ఇప్పటికి మాత్రం.

నాకు గుర్తుంది. అప్పుడప్పుడు చెప్తుండేవాడిని నిజమైన విషాదాన్ని నేను భరించగలను. ఒకవేళ అటువంటి పరిస్థితి దాపురిస్తే ఎర్రని పోర్వను (శవం మీద కప్పే వస్త్రం) కప్పుకొని–గంభీర విషణ్ణవదనంతో భరించగలనని చెప్పాను. కాని అన్యాయంగా, ఈ ఆధునికత – ఇదంతా ఒక హాస్యాస్పద వేషంగా మార్చివేసింది. అందువలన గొప్ప జీవితసత్యాలు కూడా సర్వసాధారణమైనట్లు, అసహ్యకరమైన పద్ధతిలోనే కనబడతాయి. ఆధునికతలో ఇది పూర్తి సత్యమే.

*నిజానికి నిజజీవితంలో ఇది నిజమే!*

త్యాగమూర్తులందరూ చూసేవాడికి అసహ్యంగానే కనబడతారు. ఈ పంథొమ్మిదవ శతాబ్దం కూడా దీనికి మినహాయింపు కాదు.



నా దురవస్థకు సంబంధించినదంతా భయంకరంగానే, అధోస్థాయిలోనే, వ్యతిరేకమైన, ఏమాత్రం గౌరవప్రదం కాకుండా ఈ దుస్తులలో దారుణమైన అవతారంలో, భయంకరంగా వుంది. దుఃఖాన్ని భరిస్తున్న హాస్యగాళ్ళవలే వున్నాము. హృదయాలు పగిలిపోయిన సర్కస్ బఫూన్‌లలాగా; ఏదో హాస్య నాటకానికి వేషం వేసినట్లు మమ్మల్ని నిలబెట్టారు.

నవంబరు 13, 1895 రోజున లండన్ నుంచి ఇక్కడకు తీసుకు వచ్చారు. మధ్యాహ్నం రెండు గంటల నుంచి ఒక అర గంటసేపు Clapham Junction లో ఫ్లాట్‌ఫారమ్ మీద ఈ ఖైదీ బట్టల్లో నిలబెట్టారు. చేతులకు బేడీలు వేశారు. ప్రపంచానికి నన్ను ప్రదర్శనకు పెట్టారు. అంతకు ముందు నన్ను ఆసుపత్రినుంచి కనీసం ఒక్కమాట కూడా చెప్పకుండా ఇక్కడకు తీసుకువచ్చారు. బహుశా ఆ క్షణంలో నాకంటే అసహ్యంగా మరేదీ వుండలేదేమో! జనం నన్ను చూసి వెకిలిగా నవ్వారు. అటుగా వచ్చిన రైలుబండి ఆగిన ప్రతిసారీ గుంపు పెరిగిపోయింది. వారందరికీ నా స్థితి ఎంతో వినోద పూరితంగా వుంది. అది నేనెవరో వారు గుర్తు పట్టక ముందు.

కాని నేనెవరో తెలిసిన తర్వాత వాళ్ళు మరింత బిగ్గరగా నవ్వారు.

ఆ నవంబరు విషాద వర్షంలో అలాగే నిలబడ్డాను. నా చుట్టూ ఎగతాళి చేస్తున్న గుంపును భరిస్తూ....

ఆ తర్వాత ఒక సంవత్సరం పాటు అదే సమయానికి రోజూ ఏడ్చాను. అదే గంటకు–అదే ఖాళీసమయంలో! ఇది మీకు అంతగా విచారించదగిన విషయం అన్పించక పోవచ్చు. కాని జైలుగది కన్నీళ్ళలో వున్న వాళ్ళకు ఇది సర్వసాధారణం. జైలులో నీవు ఏడ్వలేని రోజు – నీ గుండె రాయిలా మారినట్లే. నీ గుండెలో ఏ మాత్రం తడివున్నా, ఏడవకుండా వుండలేవు.

ఇప్పుడు, నన్ను చూసి నవ్విన వాళ్ల గురించి బాధపడుతున్నాను. వారు చూసినపుడు - నేను ఉన్నతమైన స్తంభం మీద లేను. ఆ స్తంభంలోపల వుండి పోయాను. నిజానికి ఉన్నత స్థానం అనేది ఒక ఊహాజనితమైన, అసత్యమైన స్థానం - కాని స్తంభపు లోగుట్టు భయంకరమైన సత్యం. విషాదాన్ని, దుఃఖాన్ని ఏ విధంగా చూడాలో వారు తెలుసుకోవాలి.

ఇంతకుముందు చెప్పినట్లు, ప్రతి విషాదం వెనక విషాదమే వుంటుంది. అంతేకాదు – ప్రతి విషాదం వెనుక ఒక ఆత్మ వుంటుంది. అదిగో ఆ బాధలో వున్న ఆత్మను ఎగతాళి చేయటం, భయంకరమైన విషయం.

***ఈ వింత సాధారణ ఆర్థిక ప్రపంచంలో - ప్రజలకు, వాళ్లిచ్చిందే, వాళ్లకు దక్కుతుంది!***

భౌతికమైన గుల్లను దాటి వెళ్లని వీరి ఆలోచనకు, జాలి ఎలా తెలుస్తుంది? ఎగతాళి గాక!

ఇదంతా ఎందుకు రాస్తున్నాను? దీని ప్రభావం - అదే ఈ ఖైదు ప్రదేశం - నాలో ఎంతటి చేదు అనుభవాన్ని మిగిల్చినదో, నిరాశతో నింపిందో - ఈ శిక్షకు పర్యవసానమేమిటో తెలపటానికి. అవును, ఇది నేను అంగీకరించినా, లొంగిపోయినా – నేను ఇది అనుభవించ వలసిందే.

***వసంతమంతా ఒక మొగ్గలో దాగి వుంటుంది. చందోలిపక్షి గూడు - ఎన్నో అరుణారుణ ఉషోదయాలను దాచి వుంచుతుంది. ఇంకా నాలో ఏ జీవనసౌందర్యం దాగివున్నా, మిగిలివున్నా - అది నా లొంగు బాటులోనే వుంది. అవమానం లోనే వుంది - భంగపాటు లోనే వుంది!!***

ఇప్పుడు, నా పద్ధతిలో, నా ఆలోచనలో, ఇప్పటి వరకు జరిగినవన్నీ అంగీకరిస్తూ, ముందుకు సాగిపోవాలి. నన్ను నేను నిరూపించుకోవాలి.




లోకం నన్ను ప్రత్యేక వ్యక్తిత్వంగల వానిగానే చూసింది. ఇప్పుడు, ఇంతకు పూర్వం కంటే కూడా మరీ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సంతరించుకోవాలి.

నా నుంచి నేను మరీ దూరంగా వెళ్లిపోవాలి. ఈ ప్రపంచం నుంచి ఆశించవలసింది, తీసుకోవలసింది, నేను తగ్గించుకోవలసివుంది.

నిజానికి నా పతనం ప్రత్యేక వ్యక్తిత్వం వలన సంభవించలేదు. వ్యక్తిత్వ లేమి వలననే జరిగింది.

అవమానకరమైన, క్షమార్హంకాని, అసహ్యకరమైన ఒకే ఒక చర్య, నా జీవితంలో: ఈ సమాజాన్ని నాకు సహాయం చేయమని, నాకు రక్షణ కల్పించమని అడగటమే. ఆ విధమైన అభ్యర్థన చేసిన తర్వాత (అది వ్యక్తి పరంగా నాకు మంచిది కాకపోవచ్చు) ఇంక ఎలాంటి క్షమార్హత వుంటుంది?

***ఆ విధంగా సమాజ శక్తుల్ని కదిలించినప్పుడు – "నువ్వు ఇప్పటి వరకూ సమాజ చట్టాల్ని ధిక్కరించి జీవిస్తున్నావు – ఇప్పుడు రక్షణెలా కోరతావు ?" అని "అవే చట్టాలు నిన్ను చుట్టు ముట్టుతాయి– వాటి శక్తి చూపుతాయి" అని మరీ హెచ్చరించింది. "నీవు రక్షణ కోరిన వారికే నీవు కట్టుబడి వుండాలి" అని కూడా ఘోషించాయి.***

దాని ఫలితమే నేను ఈ కారాగారంలో వున్నాను. ఇంతవరకూ ఎవరికీ ఇటువంటి అన్యాయం జరిగి వుండదు.

★★★

మత్స్యకారులు, గొర్రెల కాపరులు, పొలాలు దున్నేవారు, రైతులు ఇంకా ఇలాంటి మనోహరమైన సాధారణ ప్రజలు – వారికి కళ గురించి తెలియక పోవచ్చు, కానీ వారే కదా

*ఈ మట్టికి ప్రాణం – ఈ భూమికి సారం !*

ఎవడు శత్రువు? సమాజంలోని బధిరాంధులయిన యాంత్రిక శక్తులకు ఊతమిచ్చి నిలబడే వాడే – నిజమైన శత్రువు!

మనిషిలోని చైతన్యాన్ని – సమాజంలోని వికాసాన్ని గుర్తించలేని వాడే అసలైన శత్రువు.

నేను విందుల సందర్భంలో వినోదాన్ని అందిస్తుంటే, నన్ను పనికి మాలిన వాడిగా జమకట్టారు. కాని ఒక కళాకారునిగా చూస్తే అదే ఎంతో ఉత్సాహభరితంగా, వినోదాత్మకంగా వుండేది. దానిలోని ప్రమాదం అర్థభాగమే– నేను కళాకారునిగా Ariel తో వున్నాను, Caliban తో కుస్తీ పట్టాను.

నాకు పదేళ్లుగా సన్నిహితంగా వున్న స్నేహితుడు, ఈ మధ్య నన్ను చూడటానికి వచ్చాడు– 'నిన్ను గురించి చెప్పినవేవీ నేను నమ్మలేదు' అన్నాడు. 'నువ్వు అమాయకుడివి, నీ మీద కుట్ర జరిగింది.' అని కూడా అన్నాడు. నేను ఏడ్పు ఆపుకోలేక పోయాను.

నా మీద వచ్చిన అభియోగాలన్ని – నా మీద అసూయతో చేసినవే. కాని నా జీవితమంతా అస్తవ్యస్తమైన ఆనందాల వేటలోనే గడిచిపోయిందని, ఈ విషయం నువ్వు పూర్తిగా అర్థం చేసుకుంటేనే – మన స్నేహం నిలబడుతుందని చెప్పాను.

ఇది విని అతను నిర్ఘాంత పోయాడు. అయినా మేము స్నేహితులగానే వుండిపోయాం, నిజాయితీగా!




మానసిక ఉద్వేగాలు కూడా, శారీరక, భౌతిక శక్తుల లాగానే కొద్దికాలమే వుంటాయి.

ఒక పాత్రలో ఎంత మధువు పోస్తాము? ఎక్కువ పోసినా వుండదు కదా–

అలాగే ద్రాక్షపళ్ల తొట్టిలో కాళ్లతో తొక్కే వాళ్లకు దీనితో సంబంధం లేదు కదా !

చాలా గొప్ప విషాదాలకు కారణమైన వాళ్లకు – అసలు ఆ విషయమే తెలియక పోవచ్చు.

తనను ఆహుతి చేసుకునే త్యాగి – ఆ మంటల్లోంచి దేవుని చూస్తుండవచ్చు కాని, అతనికి చితిని పేర్చిన వాడికి ఇవేమీ పట్టవు కదా. మాంసం అమ్మేవాడు – ఎద్దుని ఎలా నరికారు అని ఆలోచించడు. అలాగే చలిమంట కాగేవాడు– అడవిలో చెట్టు కూలడం వినడు . పచ్చగడ్డి కోసే వాడు– పూలు రాలి నలిగి పోవడం గుర్తించక పోవచ్చు.

గొప్ప గొప్ప ఉద్వేగాలు, ఆత్మానందం కోసమే – గొప్ప సంఘటనలను, వాటిని అందుకో గలిగిన వారే చూడగలరు.

★★★

షేక్స్పియరు సృష్టించిన రోజెన్క్రాంజ్ (Rosencrantz) – గిల్డెన్‌స్టెర్న్ (Gildenstern) పాత్రలు నాటక కళలో మరి దేనితోనూ పోల్చదగినవిగా నేను అనుకోను. వానిలోని అతిసూక్ష్మమైన పరిశీలన మరెందులోను కానరాదు. వీరిద్దరూ – హామ్లెట్ సహాధ్యాయులు. అతనికి తోడునీడగా

వున్నారు. వారితో పాటు తీయని జ్ఞాపకాలు, ఆనందమైన రోజులను మోసుకొని వచ్చారు.

వారు అతనిని కలిసినపుడు – హామ్లెట్ మానసికంగా మోయలేని బరువు క్రింద నలిగిపోతున్నాడు. చనిపోయిన వాళ్ళు సమాధుల్లోంచి లేచి వచ్చి పగతీర్చుకోమని అతన్ని వత్తిడి చేస్తున్నారు. ఇది అతనికి ఏమాత్రం ఆనందకరమైన విషయంకాదు.

అతను కలల ప్రపంచంలో విహరించే వ్యక్తి. కాని ఇపుడు కత్తి చేతబట్టి కార్యరంగంలోకి దూకమంటున్నారు. అతని హృదయం కవితాత్మకం. కాని అతనిని సాధారణ కార్యకారణ సంఘర్షణలోనికి దిగమంటున్నారు. జీవితంలోని సత్యాన్ని దర్శించమంటున్నారు. కాని అతనికి దానిని గురించి ఏమీ తెలియదు. అంటే అతనికి బాగా తెలిసిన జీవితపు ఆదర్శసారం నుంచి దూరంగా ఉన్నాడు అన్నమాట!

ఏమి చేయాలో తెలియని సంకటంలో, అతను చేసిన తప్పు – అలా తప్పుగా నటించడమే! బ్రూటస్ పిచ్చిని, తన కార్యసాధన ఖడ్గాన్ని దాయటానికి, తన తలంపు కటారిని కప్పి పుచ్చటానికి అడ్డు పెట్టుకున్నాడు. కాని హామ్లెట్ తన పిచ్చి నటనను – పిరికి తనానికి ముసుగుగా తెరవేసుకున్నాడు.

ఈ తతంగం అంతా ఆలస్యం చేయటానికే వాడు కున్నాడు. నాటకాన్నంతా నటనతోనే గడిపాడు – నటుడు కథతో తాత్సారం చేసినట్లు. తన కార్యకలాపాలకు తనే వేగుగా మారాడు–తన మాటను తనే వింటూ 'మాటలు– మాటలు– మాటలే' అనుకుంటూ– తన చరిత్రకు కథానాయకుడుగా వుండవలసినవాడు తన విషాదానికి సాక్షిగా నిలబడి పోయాడు. ఏదీనమ్మలేని స్థితిలో, తనని తనే విశ్వసించ లేక పోయాడు. కాని ఈ సందిగ్ధత అతనికి ఏమీ సహాయకారి కాలేదు.

ఎందుకంటే అది, సందేహం నుంచి కాకుండా, మానసిక సంఘర్షణ నుంచి వెలువడింది. తెగిన తలంపు నుంచి; ఖండితాభీష్టం నుంచి; ద్వివిధ ఆలోచన నుంచి జరిగింది.

ఇందతా అతని స్నేహితులైన గిల్డర్‌స్టెర్న్‌కి, రోజెన్‌క్రాంజ్‌కి తెలియదు. వాళ్ళు నవ్వుతారు, అభివాదం చేస్తారు, పళ్ళికిలిస్తారు. ఒకళ్లు చెప్పింది మరొకరు పునరుక్తం చేస్తారు. చివరికి నాటకంలోని అంతర్నాటకం ద్వారా హామ్లెట్, రాజు మనసుని తెలుసుకుని, అతనిని సింహాసనం మీద నుంచి కిందకు తోసినపుడు, అతని మిత్రులే – హామ్లెట్ చేష్టలకు ఆశ్చర్యపోయి, అది అమర్యాద చర్య అనుకుంటారు. దానిని జీవితంలోని ఉద్వేగాల ప్రదర్శనకు అవకాశమనుకుంటారు.

హామ్లెట్ జీవిత రహస్యానికి ఎంత దగ్గరగా వున్నా వారికి – దానిని గురించి ఏ మాత్రం ఎరుక లేకుండా వుండి పోతారు. తెలిసినా దాని వలన ఉపయోగం కూడా వుండకపోవచ్చు. వీరు, వీరే. చిన్న చిన్న పాత్రలు – మధువుని ఎక్కువగా నింపినా – ఒలికిపోయే మధుపాత్రలు!!

చివరికి ఎవరి కోసమో పన్నిన ఉచ్చులో పడి హఠాత్తుగా మరణిస్తారు. నిజానికి ఇటువంటి విషాదాంతం, వీరికి తగినది కాదు. హామ్లెట్ దీనిని ఎంత తేలికగా తీసుకున్నా వారు మరణించలేదనే అనుకోవాలి. చివరికి హొరాషియో (Horatio) హామ్లెట్‌కు అసంతృప్త సత్యాలను చేరవేయటానికి ఈ కర్కశ ప్రపంచం నుంచి, చివరి శ్వాసను తీసుకుని, నిష్క్రమిస్తాడు!

కాని, గిల్డర్‌స్టెర్న్ – రోజెన్‌క్రాంజ్ అమరులే. ఎంజెలో ఆంగ్లో ; టార్‌టాఫే (Angelo Anglo ; Tartaffe) లాగా వారి సరసన ఉండదగిన వారు. పాతతరపు స్నేహానికి కొత్తతరమందించిన విలువలు వీరు.

ఎవరైనా కొత్తగా De Amieitia రాస్తే అందులో వీరికి స్థానం కల్పించాలి. వారిని Tusculan వచనంలో అభినందించాలి. వీరు సర్వకాలాల్లోను ఉండవలసిన వారు. వీరిని బహిష్కరించటం అంటే వారిని

గుర్తించి ప్రశంసించ లేకపోవటమే. వారు కేవలం ఒక పరిధిలో లేదా ఒక వృత్తంలో లేకపోవటం, అంతే.

ఆత్మావలోకనంలో అంటు రోగాలేమీ ఉండవు కదా. ఉన్నతమైన ఆలోచనలు – ఉద్వేగాలు కేవలం వాటి అస్తిత్వం లోనే భిన్నంగా ఉండిపోతాయి.

★★★

అన్నీ సవ్యంగా జరిగితే మే నెలలో నన్ను విడుదల చేస్తారు. ఆ వెంటనే R తోను, M తోను కలిసి, మరోదేశం వెళ్ళి, సముద్రతీరంలోని ఏ చిన్న ఊరికో చేరతాను.

సముద్రపుటలలు మన గాయాలను, మరకలను కడిగివేస్తాయి– Euripides ఆయన నాటకంలో Iphigeneia గురించి, చెప్పినట్లు.

ఒక నెల రోజుల పాటు నా స్నేహితులతో గడపాలని ఆశిస్తున్నాను. ఆ విధంగా శాంతిని, సత్త్వాన్ని పొంది గుండె బరువును తగ్గించుకోవాలని అనుకుంటున్నాను.

నాకు కొన్ని ప్రాథమిక విషయాలపై ఎనలేని మక్కువ. ముఖ్యంగా అమ్మలాంటి సముద్రం మీద – అలాగే నేలతల్లి మీద. మనందరం ఈ ప్రకృతిని చాలా ఎక్కువగా చూస్తాం. కాని ప్రకృతిలో చాల తక్కువగా జీవిస్తాం.

ఈ విషయంలో గ్రీకులు, తెలివిగా వుంటారు. వీరు సూర్యాస్తమయాలు, పచ్చగడ్డి మీద నీడలు చూడరు. కాని సముద్రం ఈతగాళ్ళ కోసమని, పచ్చిక బయళ్లు పరుగులు తీసే వాళ్లకోసమని అనుకుంటారు.

చెట్లను, వాటి నీడకోసం ప్రేమిస్తారు. అడవిని, మధ్యాహ్నపు నిశ్శబ్దం కోసమే ఇష్టపడతారు. ద్రాక్షతోటలో బుట్టటోపి పెట్టుకుని ఎండ పడకుండా పనిచేస్తారు.

మనకు గ్రీసు దేశం అందించిన వారు రెండు రకాలు– కళాకారులు, క్రీడాకారులు. వీరి కోసమే కదా ఆ లతాతోరణాలు, ఆలివ్ ఆకుల కిరీటాలు తయారయ్యేది!

మనది వస్తు ఉపయోగ యుగమని చెప్పుకుంటాం. కాని, ఏ ఒక్క వస్తువు అవసరమూ మనకు సరిగా తెలియదు.

నీళ్ళు శుభ్రపరుస్తాయని మర్చిపోయాం. అగ్ని పునీతం చేస్తుందని, ఈ భూమి మనకు తల్లిలాంటిదని కూడా మర్చిపోయాం. దీని పర్యవసానమే మన కళ, చంద్రునితో ఉంటూ నీడలతో ఆడుకుంటోంది. కాని గ్రీకు కళ సూర్యునితోనే ఉండి అన్నింటినీ వెలుతురు లోనే సూటిగా చూస్తోంది.

నేను గాఢంగా నమ్మేది, ప్రాథమిక శక్తుల్లోనే స్వచ్ఛత ఉందని. అందుకే అక్కడికే వెళ్ళాలని, వాటి సన్నిధిలోనే జీవితం గడపాలని అనుకుంటున్నాను. నాలాగా ఆధునికంగా ఉండేవాడికి Enfant de mon siecle (Child of my century) ప్రపంచాన్ని చూడటమే ఆనందం.

నా విడుదల రోజున రేలమొక్క పూలను, దానాని మొగ్గలను విరియటం చూసి పులకించి పోతాను. గాలి ఈ పూలను ఉయ్యాల ఊపుతూ రంగులతో నింపి నన్ను అరేబియా తీరానికి తీసుకుపోతుంది.

Linnaeus మొదటిసారిగా ఇంగ్లీషు పీఠభూమి అంతా బంగారు రంగు గడ్డితో వాసనలు వెదజల్లుతుంటే చూసి దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు గదా!

పూలు నా ఇష్టంలో భాగమే, నా కోసం గులాబిరేకు వంపులో ఒక కన్నీటి బొట్టు దాగి ఉందని తెలుసు. ఇంత వరకు ఏ రంగు ఏ పూలకలశంలో దాగివున్నా, ఏ గుల్ల వంపులో ఏ అందం ఇమిడివున్నా నా మనసు, తెలియని సానుభూతితో స్పందిస్తూనే ఉంది. ఇది నా చిన్నప్పటి నుంచి జరుగుతూనే ఉంది.



**భార్య: కాన్‌స్టాన్స్ ; కొడుకు : సిరిల్**

గోతియర్ (Gautier) లాగా నేను కూడా Pour qui le monde visible Existe (For the visible world exists) వీరికోసం – కనిపించే ప్రపంచం ఉంది అనే వాళ్ళలో ఒకడిని.

కాని, ఈ అందాల రూపం వెనుక ఎంత సౌందర్యం ఉన్నా, ఏదో చైతన్యం దాగి ఉంటుంది. దాని స్వరూప స్వభావాలే ఈ రంగులు, ఈ ఒంపులు. అదిగో, ఆ చైతన్యంతో నేను జతకట్టాలని ఉవ్విళ్లూరుతున్నాను.

***అబ్బా! ఈ మాటల సందడితో, ఈ మనుషుల గుంపులతో విసిగిపోయాను.***

కళలోని మార్మికత, జీవితంలోని మర్మం ఈ ప్రకృతిలోని ఆధ్యాత్మికతా– వాటికోసమే నేను చూస్తున్నాను. ఈ అన్వేషణ నాకెంతో అవసరమైనది.

*అన్ని రకాల విచారణలు జీవితంలో పరీక్షలే. అన్ని రకాల శిక్షలు మరణశిక్షలవంటివే. ఇప్పటికి మూడుసార్లు నన్ను విచారించారు. మొదటిసారి బోను దిగినప్పుడు నన్ను బందీ చేశారు. రెండో విచారణ తరువాత బందిఖానాకు తరలించారు. మూడోసారి విచారించి రెండు సంవత్సరాల కఠిన కారాగార శిక్షకు పంపారు.*

*మనం నిర్మించుకున్న ఈ సమాజంలో నాకు స్థానం లేదు. అది స్థానం కల్పించలేదు కూడా. కాని ఈ ప్రకృతిలో నాకు సాంత్వన దొరుకుతుంది. చల్లని వర్షపు జల్లులు అందరిమీద ఒకే రకంగా కురుస్తాయి. బండరాతి పగుళ్ళలో నాకింత గూడు దొరకకపోదు. పర్వతసానువుల రహస్య నిశ్శబ్దంలో నేను నా దు:ఖాన్ని పొగులుకుంటాను.*

*ప్రకృతిమాత నక్షత్ర దీపాలను నా కోసం వెలిగిస్తుంది. ఆ వెలుతురులో నేను ఈ చీకటిలో తూలి పడకుండా నడుస్తాను. నా అడుగు జాడలపై గాలి వీస్తుంది– మరెవరూ నా కష్టాల దారివెంట రాకుండా.*

*ఆ తల్లి నన్ను తన పవిత్ర జలాలతో పునీతుణ్ణి చేస్తుంది– చేదు తృణకాష్ఠాలతో కడిగి పరిపూర్ణునిగా మారుస్తుంది....*

Oscar Wilde.

**ఈ రచన వెనుక :**

*ఆస్కార్ వైల్డ్ కారాగార శిక్షాసమయంలో లోనైన దుఃఖాన్ని ఆ వేదన సాంద్రతను కొంతవరకైనా ఆకళింపు చేసుకోగలిగితే ఈ రచనలోని వ్యధాపూరితమైన అగాధాన్ని, అందులోని చీకటిని అవగాహన చేసుకోవటానికి ఆస్కారముంటుంది.*

*బాధ అనేది అంతర్గతమైన, మానసిక చీకటి ప్రయాణం. దారి పొడవునా రాళ్ళూ-రప్పలు, మోళ్ళూ-పొదలు, గాయాలనెత్తుటి ఊట; ఇంకా ఎన్నో మనం తడమగలిగితేనే ఈ అగాధం లోని అంధకారం అగపడుతుంది, అవగత మవుతుంది. అతని దుఃఖపులోతుల చీకటిలో నుంచే వెలుతురు రేకలు పొడసూపుతాయి.*

*నేను చూడగలిగాను. మీరూ చూడగలరు..*
*ఇది ఎంత విషాదమో అంత రమణీయం..*
*ఎంత కర్కశమో అంత కమనీయం.*

*ఒక్క విషయం మనం గుర్తుపెట్టుకోవాలి. అతని శిక్షాకాలంలో చివరి మూడు నెలల్లోనే పుస్తకాలు గాని, రాయటానికి కాయితాలు గానీ*



**పారిస్‌లోని ఆస్కార్ వైల్డ్ లిప్‌స్టిక్ సమాధి**

అందినాయి. అదీ రోజుకి ఒక కాగితం మాత్రమే ఇచ్చేవారు. అది అయిపోయిన తరువాత వాళ్ళే తీసుకునేవాళ్ళు. అతను కోరినట్లు వాటిని అతని మిత్రునికి పంపలేదు. అప్పటి అతని మానసిక స్థితిలో ఎంతవరకూ రాసాడో (ముందురోజు) ఎలా గుర్తుంచుకున్నాడో అతనికే ఎరుక. విడుదల తరువాతనే ఈ రచన అతని చేతికి వచ్చింది. మళ్ళీ తిరగ రాసిన దాఖలాలు లేవు. అందుకనే మనకు ఈ రచనలో పునరుక్తి, ఖండితాలు కనిపిస్తాయి.

అతను చనిపోయిన ఎనిమిది సంవత్సరాలకు (అతని వీలునామాలో యాభై సంవత్సరాల తరవాతనే ముద్రించాలి అని ఉన్నా) మొదటగా కొంతభాగం ముద్రించబడింది. ఇదీ ఈ రచన నేపథ్యం. పూర్తి పాఠం యాభై సంవత్సరాల తర్వాత  వెలుగు చూసింది.

దీనికి DE PROFUNDIS అనే శీర్షిక ఆస్కార్ వైల్డ్ పెట్టినది కాదు.

– అశ్విని.కె



# విచారణ

**1892**లో లార్డ్ ఆల్ఫ్రెడ్ డగ్లస్, ఆస్కార్ వైల్డ్, స్వచ్ఛందంగా ఇద్దరూ ప్రేమికుల్లాగే కలసి తిరిగారు. ఇది అసహజంగా భావించిన యిరుపక్షాల హితైషులూ వెంటనే ఈ సంబంధాన్ని తెంచుకోమని సూచించారు. సలహాలిచ్చారు.

ఆల్ఫ్రెడ్ తండ్రి, మార్క్విస్ ఆఫ్ క్వీన్స్‌బెరీ కొడుకును తీవ్రంగా మందలించాడు. ఈ స్నేహం మానుకోకపోతే, పరిణామాలు తీవ్రంగా వుంటాయని హెచ్చరించాడు. ముఖ్యంగా, పెద్దకొడుకు వైకౌంట్ డ్రమ్‌లార్నింగ్ మరణం తర్వాత ఆయన బెంగ మరింత ఎక్కువై మాటవినకపోతే, ఆల్ఫ్రెడ్‌కు అలవెన్స్, భత్యం, ఆపేస్తానన్నాడు. అయినా కొడుకు ఆయన మాట లెక్క చెయ్యలేదు. మార్క్విస్ ఆఫ్ క్వీన్స్‌బెరీ, ఆస్కార్ వైల్డ్ వెంటపడి వేధించడం మొదలుపెట్టాడు.

1895లో, తన నాటకాలు *ఏన్ ఐడియల్ హజ్బండ్, ది ఇంపార్టెన్స్ ఆఫ్ బీయింగ్ ఎర్నెస్ట్* ఘనవిజయంతో ఆస్కార్ వైల్డ్ కీర్తి శిఖరాల నధిరోహించాడు. ప్రేక్షకులాయనకు బ్రహ్మరథం పట్టారు. విహారయాత్రల నుండి తిరిగి వచ్చిన వైల్డ్‌కు, క్లబ్బులో, క్వీన్స్‌బెరీ పెట్టివెళ్లిన "For Oscar Wilde, posing sodomite" అనే కార్డు కనిపించింది.



ఏది అసహజం?

ఈ అవమానాన్ని భరించలేని వైల్డ్, ఆల్ఫ్రెడ్ ప్రోత్సాహంతో క్వీన్స్‌బెరీ మీద పరువు నష్టం దావా వేశాడు. విచారణ ప్రారంభమైన తర్వాత వైల్డ్ తన అభియోగాన్ని వుపసంహరించుకున్నాడుగాని, క్వీన్స్‌బెరీ ఆరోపణలో

నిజముందని తీర్పు చెప్పాడు జడ్జి. అధికారులు వెంటనే వైల్డ్‌కు అరెస్ట్ వారెంట్ జారీ చేశారు. ఇతర పురుషులతో అసభ్యకరంగా ప్రవర్తించాడని కోర్టు తీర్మానించింది.

అప్పటికి అంటే, ఏప్రిల్ 1895 నాటికి అమల్లో వున్న లబూషెర్ సవరణ ప్రకారం యిది నేరం. ప్రజల్లో, వైల్డ్ అభిమానుల్లో చర్చలు కూడా జరిగాయి. కొందరు అతనికి వ్యతిరేకంగా సాక్ష్యాలు చెప్పారు.

వైల్డ్ ఆరోపణలన్నీ నిరాకరించాడు తనేమీ నేరం చేయలేదని, తాను అసహజమైన పనులేమీ చేయలేదని వాదించాడు. కోర్టువారు, జ్యూరీ కూడా ఒక నిర్ణయానికి రాలేకపోయారు. పునర్విచారణ ప్రారంభమైంది. మూడు సార్లు విచారణ తరువాత చివరికి రెండేళ్ళపాటు వైల్డ్‌కు కఠినకారాగార శిక్ష విధించబడింది.

ఆస్కార్ వైల్డ్ లాంటి ప్రతిభావంతుడు శతాబ్దకాలం ముందుగా పుట్టి తప్పు చేశాడా?

పెంటన్ విల్, వాండ్స్‌వర్త్, రీడింగ్ జైళ్ళల్లో వివిధ సమయాల్లో వైల్డ్‌ను నిర్బంధించారు. అక్కడ చాలీచాలని ఆహారం, శారీరక శ్రమ, కఠినమైన పరిస్థితులతో అతని ఆరోగ్యం పాడైంది. ఆకలి, నిద్రలేమి, యితరవ్యాధులు అతణ్ణి మరింత కుంగదీశాయి.

★★★

*ఆస్కార్ వైల్డ్ విచారణ సమయంలో 'ఈ ప్రకృతిలో ఏదీ అసహజం కాద'న్నాడు. సరిగ్గా నూటముప్పయి సంవత్సరాల తర్వాత (ఇలాంటి సందర్భంలోనే) మనసర్వోత్తమ న్యాయస్థానం ఇవే మాటలను 'ఏది అసహజమో ఎవరు చెప్పగలరు?' అని ప్రశ్నించింది.*

*ఆస్కార్ వైల్డ్ నూటముప్పయి సంవత్సరాల ముందుగా జన్మించాడని, లేదా, ఈ నాగరక సమాజం, శతాబ్దాల కాలం వెనక బడి వున్నదని అనుకోవాలా?*

# కారాగారం

**పెం**టన్ విల్‌లో, ఆర్.బి.యస్ హాల్డేన్ అనబడే సంస్కరణాభిలాషియైన ఒక పార్లమెంట్ సభ్యుడు ఆయనను కలిసి, మతపరమైన, చారిత్రక లేదా విద్యాపరమైన గ్రంథాలను అందించడానికి కృషి చేశాడు. వాండ్స్‌వర్త్ జైల్లో వున్నప్పుడు, ఒకసారి అకస్మాత్తుగా కిందపడిపోయి వైల్డ్ కుడిచెవి (కర్ణభేరి)కి గాయమైంది. రెండు నెలలపాటు జైలు ఆసుపత్రిలో గడిపాడు వైల్డ్. ఆ తర్వాత, మిత్రుల సహకారంతో, అతణ్ణి రీడింగ్ జైలుకు బదిలీ చేశారు. అక్కడ శరీర శ్రమ కాస్త తగ్గింది. చదువుకోవటానికి పుస్తకాలు కూడా ఇచ్చారు. కాని రాయటానికి అనుమతి లేదు. రచన చేయలేని రచయిత, మనోవేదనతో, అధికారులు విధించిన పనులు కూడా చేయలేకపోవటంతో, రీడింగ్ జైలు వార్డెన్ కల్నల్ ఐజాక్‌సన్ అతడికి శిక్షలు విధించాడు. అవీ చెయ్యలేనపుడు, అదనంగా మరిన్ని శిక్షలు విధించాడు.

విడుదల తరువాత వ్రాత ప్రతిని ఆస్కార్ వైల్డ్, రాస్‌కు అందజేశాడు. అప్పటికి దానికి అతను పెట్టిన శీర్షిక Epistola: In Carcere et Vinculis. (లేఖ: నిర్బంధంలో, సంకెళ్లతో) రెండు కాపీలు తీసి ఒకటి డగ్లస్‌కు, ఒకటి తనకు ఇవ్వమని కూడా చెప్పాడు. పెద్ద ఉత్తరం కనుక రాస్ దానిని కొన్ని నెలల దాకా టైపు చేయించినట్లు లేదు.

1905లో క్వీన్స్‌బెరీ కుటుంబానికి సంబంధించిన అన్ని అంశాలను తొలగించి *డి ప్రోఫండిస్* పేరుతో దానిని రాస్ ప్రచురించాడు. తరువాత మూడేళ్ళలో ఎనిమిది సార్లు అచ్చయింది. *డి ప్రోఫండిస్* (From the Depths) ఇది Psalm 130 లోనుంచి తీసుకున్నాడు.

1908లో వైల్డ్ వ్రాసిన మరో మూడు లేఖలు కూడా కలిపి *డి ప్రోఫండిస్*ను రాస్ మళ్లీ ప్రచురించాడు. ఆ తరువాత వ్రాతప్రతిని బ్రిటిష్ మ్యూజియమ్‌కు విరాళంగా ఇచ్చి 1960 దాకా వాటిని ముద్రించకూడదని ఒప్పందం కూడా చేసుకున్నాడు.

1949లో ఆస్కార్ వైల్డ్ కుమారుడు వివియన్ హాలెండ్ పూర్తి పాఠం ప్రచురించాడు గాని అందులో అచ్చుతప్పులు అనేకం వచ్చాయి. 1960లో బ్రిటిష్ మ్యూజియంలో ఉన్న అసలు ప్రతిని పరిష్కరించి, *లెటర్స్ ఆఫ్ ఆస్కార్ వైల్డ్* లో భాగంగా ప్రచురించాడు రూపర్ట్ హార్ట్ డేవిస్ అనే ఆయన. వ్రాతప్రతి కాపీని ఫోటో తీసి 2000 సం॥లో యథాతథంగా బ్రిటిష్ మ్యూజియం ప్రచురించింది.

★★★



**లార్డ్ ఆల్ఫ్రెడ్ డగ్లస్**



**ఆస్కార్ వైల్డ్**

***పం***దొమ్మిదవ శతాబ్ది చివరి దశాబ్దాలలో ఇంగ్లీషు సాహిత్యాకాశాన తళుక్కుమన్న తోకచుక్క ఆస్కార్ ఫింగల్ ఓఫ్లాహెర్టి విల్స్ వైల్డ్ (1856–1900). జననం ఐర్లండ్ రాజధాని డబ్లిన్‌లో. తల్లికి రచయిత్రిగా పేరుంది. ఆక్స్‌ఫర్డ్‌లో చదువుతున్నపుడు జాన్ రస్కిన్, వాల్టర్ పీటర్ కళాసిద్ధాంతాలతో ప్రభావితుడయ్యాడు వైల్డ్.

'కళకోసమే కళ' అని గాఢంగా నమ్మిన రచయిత పలు వ్యాసాలు, నాటకాలు, కథలు, ఒక నవలతో తన అభిప్రాయాలను ప్రచారం చేశాడు. ప్రత్యేక వింత వేషధారణతో అందర్నీ చకితుల్ని చెయ్యటం ఈయనకు సరదా. గొప్ప సంభాషణాచతురుడుగా, మాటల మాంత్రికుడుగా పేరుగడించాడు. ఆయన రచనల్ని చదివి ఎవరెంత ఆనందించినా, వైల్డ్ స్వయంగా చదివినప్పుడు, మాట్లాడినప్పుడు శ్రోతలకు కల్గిన అద్భుతానుభవంతో పోల్చితే, అది కేవలం పదిశాతమేనంటారు.

నైతికతకూ, కళకూ సంబంధంలేదన్నది ఈయన మరో సిద్ధాంతం. కథకుడిగా, కవిగా వైల్డ్‌కు కొంత గుర్తింపు వచ్చినా, 1892 నుండే బ్రిటిష్ రంగస్థలం మీద సంచలనం సృష్టించిన నాటకాలు, 'లేడీ విండర్ మీయర్స్‌ఫాన్,' 'ఏ వుమన్ ఆఫ్ నో ఇంపార్టెన్స్,' 'ఏన్ ఐడియాల్ హజ్బండ్,' 'ఇంపార్టెన్స్ ఆఫ్ బీయింగ్ ఎర్నెస్ట్' లతో కీర్తీ, డబ్బూ వరించాయి. సుఖలాలసతే జీవితధ్యేయంగా బ్రతికిన వైల్డ్‌లో స్వలింగ సంపర్కం మీద మోజు కలిగింది. 1991లో ఈయన ప్రచురించిన, 'పిక్చర్ ఆఫ్ డోరియన్‌గ్రే' లో కూడా పాత్రల స్వభావం యిలాంటిదే. (జర్మన్ మహాకవి గ్యోతే రాసిన ఫాస్ట్ కావ్యాన్ని తిరగరాశాడన్నారు విమర్శకులు)

మరో నాలుగేళ్లకు, వైల్డ్ కామప్రవృత్తికి నిదర్శనంగా కోర్టువారు కూడా ఈ నవలను పరిగణనలోనికి తీసుకున్నారు. భార్యా, యిద్దరు కుమారులున్న వైల్డ్ లార్డ్ ఆల్ఫ్రెడ్ డగ్లస్ అనబడే యువకుడితో బహిరంగంగా సంబంధం పెట్టుకున్నాడు. ఆ కుర్రాడి తండ్రి మార్క్విస్ ఆఫ్ క్వీన్స్‌బరీ, వైల్డ్‌ను Posing Sodomite అని తిట్టాడు. అందరిముందు అవమానించినందుకు, వైల్డ్ అతనిమీద కేసు వేశాడు. విచారణ అనేక నెలలు కొనసాగింది. వైల్డ్‌కు యితర యువకులతో కూడా లైంగిక సంబంధాలున్నట్టు రుజువైంది. రెండేళ్ళు కఠిన కారాగార శిక్ష పడింది. 1898లో రీడింగ్ జైలునుండి విడుదలై ఫ్రాన్సుకు వెళ్లిపోయాడు వైల్డ్. నాటకశాలల యజమానులు, ఒకనాటి మిత్రులు పలకరించటానికి కూడా యిష్టపడలేదు. జైల్లో వున్నప్పుడు వైల్డ్, తన సన్నిహితుడు డగ్లస్‌కు రాసిన సుదీర్ఘ లేఖ **డి ప్రోఫండిస్.** పారిస్‌లో రెండేళ్ళు దుర్భర దారిద్ర్యంలో గడిపిన వైల్డ్ 1900 నవంబర్, 30న మరణించాడు. స్వయంకృతాపరాధమూ, సమకాలీన సమాజపు కృత్రిమ విలువలూ ఒక ప్రతిభాశాలిని బలితీసుకున్నాయి.

